# విషయానుక్రమణిక

ముఖచిత్రం : పారమౌంట్ వారి తార మేరిలిన్ మాక్స్‌వెల్.





# కాలక్షేపం

"అంకముజేరి శైలతనయా
స్తన దుగ్ధము లాను వేళ, బా
ల్యాంక విచేష్ట దొండమున
నవ్వలిచ న్గబళింపబోయి, యా
వంక కుచంబు గాన, కహి
వల్లభుహారము గాంచి వేమృణా
ళాంకుర శంకనంటెడు
గజాస్యుని గొల్తు నభీష్టసిద్ధికిన్ "

తా॥ విఘ్నేశ్వరుడు పార్వతీదేవి ఒడిలో కూర్చుండి పాలు త్రాగే సమయంలో ఒక వైపున ఉన్న స్తనములోని పాలు త్రాగుచు, చిన్న బిడ్డలకు సహజమైన చేష్టను అనుసరించి రెండవ స్తనమును చేతితో అనగా తన తొండముతో స్పృశించి పుణికి పుచ్చుకొనుటకై ప్రయత్నింపగా, సగము పార్వతీ రూపము సగము శివుని రూపము గలిగిన అర్ధనారీశ్వర స్వరూప మది యగుట చేత, రెండవ ప్రక్కను స్తనము కన్పించక శివుని మెడను వ్రేలాడు సర్పరాజము ఉండుటవల్ల, ఆ సర్పమును తామరకాడ యనుకొని తన తొండముతో స్పృశించి, ఆడుకొనుచుండునట్టి గజాస్యుడు (విఘ్నేశ్వరుడు) మా కోరికల నీడేర్చవలయునని ప్రార్థించుచున్నాను.

అల్లసాని పెద్దన్నగారి అల్లిక జిగిబిగి అన్నట్లుగా ఉంది యీ పద్యం శ్రీకృష్ణదేవరాయలవారి అభీష్టసిద్ధికై పై విధంగా పెద్దన్నగారు విఘ్నేశ్వర ప్రార్థన చేశారు శ్రీకృష్ణదేవరాయలవారి పరిపాలన చాలా జయప్రదంగానే జరిగింది. అఖండ వైభవంగా సాగింది. ఆ మహారాజు ఎక్కడికి దండెత్తి వెళ్లినప్పటకీ, ఒక్కటే మహోత్కృష్ట సంకల్పంతో వీరవిహారం చేశాడు. మహమ్మదీయ ప్రభువులు ఆ దినాలలో హిందూమతం హతం చేయవలెనని కత్తి కట్టి, దేశాన్ని కొల్లగొట్టి, హిందూస్త్రీలను చెరబట్టి, గోవులను తమ కరకు కత్తుల కెర జెట్టినందువల్ల హిందువులు చెక్కుచెదరిన ధైర్యంతో, దిక్కులేని దీనులవలె దిక్కుమొగములతో వేయి దేవుళ్లకు మొక్కుకొనుచుండిరి. అటువంటి మహమ్మదీయ దండయాత్రల మహాభీభత్స కాలములో భారతదేశములోని స్వతంత్ర హిందూ రాజులు తమలో తాము ఐకమత్యం లేనివారగుటవల్ల శత్రువును ఏకముఖంగా ఎదిరించలేక, దాసిలొగ్గి దాసులగుచుండిరి ఈ దేశ దుర్దశను శ్రీకృష్ణదేవరాయలవారు తలపోసి విలపించి, హిందూరాజుల నందరిని ఒక్క కూటమిలోనికి కూడదీసికొనివచ్చి సంఘటీకరించి భారతదేశపు హిందూ ప్రభువుల ఐక్యరాజ్యపీఠము నొకదానిని ఏర్పాటు చేయవలెనని సంకల్పించారు. సామ దాన భేద దండోపాయములచేత యీ హిందూరాజ్య పీఠ ప్రతిష్ఠాపనకై అప్రతిహత అకుంఠిత అచంచల అనల్ప సంకల్ప బలముతో సైనిక బలముతో తదేక దీక్షతో ధర్మమేవ జయతి యను ఆత్మధైర్య విశ్వాసముతో అహోరాత్రములు కృషి చేసి, ఆయన ఆచంద్రతారార్కమైన అఖండ కీర్తి గడించి తరించెను.

శ్రీకృష్ణదేవరాయల కాలములో ఆంధ్ర సామ్రాజ్యము మహోచ్ఛస్థితికి వచ్చినదని లోకము యీనాటికిని మెచ్చుచున్నది. నిజమే. కాని, శ్రీకృష్ణరాయలవారి మాతృభాష తెనుగు మాత్రము కాదు. ఆయన యింట్లో ఆయన మాట్లాడినది తుళుభాష. దీనికి వ్రాత అక్షరాలు ప్రత్యేకంగా లేవు గాని కన్నడపు లిపినే తుళుభాషకు కూడా ఉపయోగిస్తారు.

అందువల్ల ఆయన కన్నడపు రాజని కర్ణాటకులు వాదించడం సంభవించింది ఆమాట కూడా నిజమే. కాని, ఆయన తెనుగు భాషలో అనర్గళమైన పాండిత్యప్రావీణ్యం గడించి, "ఆముక్త మాల్యద" (విష్ణు చిత్తీయము) అనేటటువంటి చూడిక్కుడుత్త నాంచారమ్మ కథను (పన్నిద్దరాళ్వారులలో నొకడగు పెరియాళ్వారు కుమార్తె కథను) వైష్ణవ భక్తి ప్రపత్తులచ్చొత్తినట్లుగా అత్యద్భుతమైన ప్రబంధమును రచించెను. ఆంధ్ర

భాషలో పంచ కావ్యములని చెప్పదగిన అయిదు ప్రముఖ ప్రబంధములలో యీ ఆముక్తమాల్యద ఒకటి. అల్లసాని పెద్దన గారు రచించిన మనుచరిత్ర రెండవది శ్రీనాథుని ఆంధ్రశృంగార నైషధము మూడవది తెనాలిరామలింగని పాండురంగ మహాత్మ్యము నాల్గవది రామరాజభూషణుని వసుచరిత్రము అయిదవది. ఇటువంటి ఉత్కృష్ట ప్రబంధరాజములలో చేర్చదగినవి ఇంకను మరికొన్ని ఉన్నాయి. వాటిని కూడా యీ ప్రథమశ్రేణి ప్రబంధ పట్టికలో చేర్చవచ్చు. ఇంతకూ చెప్పవచ్చిన ప్రధాన విషయం ఏమిటంటే, శ్రీకృష్ణ రాయలు ఒకవైపున కన్నడమును మాతృభాషగా వాడుచున్నవాడై మరొకవైపున ఆంధ్రమునే తన అభిమాన భాషగా స్వీకరించి నటువంటివాడు. కన్నడపువాడైనను ఆంధ్రావనికి దత్తపుత్రుడు మాతృభాషకుకు అయినప్పటికీ, తన దర్బారులో రాజభాషగా ఆంధ్రమునే అనువర్తింపజేసెను ఆయన దర్బారులో ఆయన వ్యవహారము లన్నియు ఆనాడు తెనుగులోనే జరిగినవి

ఆయన ఉత్తరమున కళింగ రాష్ట్రం జయించాడు. అందువల్ల ఓఢ్రం మాట్లాడే రాయబారులు, ప్రముఖులు, పండితులు ఆయన సభలో ఉండగలరు. ఆయన మధుర పాండ్యరాజులను జయించారు అరవదేశము లోని అనేక ప్రముఖులు ఆయన ఆస్థానంలో హాజరవుతూ ఉండేవారు. తమిళ పండితులు కూడా తమ ప్రావీణ్యం ప్రదర్శించేవారు కన్నడ పండితులు, కన్నడులైన రాజబంధువులు చాలామంది కర్ణాటేయంగా ఆయనతో ఇష్టాగోష్ఠిగా మాట్లాడుతూ ఉండే వారు

"వంగ సింహళేశ కన్యకామణి
ప్రకరపాణిఘటిత రత్న
పాదకా కలాచికా,
ముకురపీటికా కర్ణండ
ముఖ్య రాజలాంఛనా"

అని పెద్దన్నగారు వర్ణించారు. వంగదేశ కన్యకలు, సింహళదేశపు కన్యకా మణులు ఆయనకు పరిచారికలుగా ఉండే వారు ఒకతె పాదుకలు పట్టుకొని తెచ్చేది ఇంకొకతె ఆయన ఎదుట తమ్మపడిగ (పీక్దాన్ - ఉమ్మివేసికొనుటకై) పట్టుకొనేది మరొక ముద్దియ ఆయన ఎదుట అద్దమును పట్టుకొని నిల్చునేది. ఇంకొక తన్వంగి తములపాకుల పెట్టెను (పాన్‌దాన్) పట్టుకొని నిల్చునేది. ఈరీతిగా బెంగాలీ కన్యలు, సిలోను కన్యలు కూడా ఆయన దివాణంలో ఉండేవారు ఇన్ని భాషలు మాట్లాడేటటువంటి అందమైన ఆటకత్తెలు అందకత్తెలు ఆయన హాజారంలో తమ తమ హావభావలీలావిలాసములను స్వభాషా గాత్ర మాధుర్యమును ఆయనకు చూపించి ఆయనను ఆనందింపజేసినప్పటికిన్నీ, ఈ భాషల మాధుర్యంకంటె, తన మాతృభాషా మాధుర్యంకంటె, తెనుగుభాష తేనెకంటె తియ్యగా ఉన్నదన్నాడు. "దేశభాషలందు తెనుగు లెస్స" అనే మాట ఆయన మనస్ఫూర్తిగా అన్నాడు. అఖిల దేశభాషా

# ★ కాలక్షేపం ★

సమితిలో ఆంధ్ర భాషకు పట్టాభిషేకం చేశాడు. ఆయన చేసిన యీ ఆంధ్రభాషా ప్రశంస నిష్పాక్షికమైనది ఎందుచేతనంటే తన మాతృభాషకంటె కూడా ఆంధ్రభాష అగ్రగణ్యమైన దన్నాడు

అంతే కాదు. ఆయన "హిందూరాజ్య రమా","హిందూరాజ్య రమా" అని కలువరించాడు అటువంటి హిందూరాజ్యలక్ష్మిని యీ దక్షిణ భారతదేశంలో ఆయన యించు వించుగా ప్రతిష్ఠించిన మహారాజు అని చెప్ప వచ్చు. అయితే, ఆయన నిర్మించిన హిందూ సామ్రాజ్యానికి అసలైన గుండెకాయ తెనుగుసీమ ఈ తెలంగాణా అంతా ఆయనకు ఆటపట్టు కావడంచేత, ఈ తెనుగు రాజ్యం ఆయనకు కామధేనువై, చింతామణియై, కల్పవృక్షమై, కొంగుబంగారమై, ఆయన తలపెటన ధర్మసంస్థాపనకు "జయ విజయీభవ" అని ఏకముఖంగా దిశదిశల దుందుభులు మ్రోగించింది కమ్మ పటాలములు, రెడ్డి పటాలములు, వెలమ వీరులు ఆయన దిగ్విజయ యాత్రకు రథం లాగి ఆయన మనోరథం యీడేర్చారు దక్షిణమున రామేశ్వరం వరకు సింహాళం వరకు తెనుగు వీరులు బారులుతీర్చి నడిచారు. ఉత్తరమున బెంగాలువరకు తెలుగు పతాకం వెలిగింది 'ఆంధ్రదేశం నా ఏలుబడిలో ఉంటే, అఖండ హిందూరాజ్యం అవలీలగా స్థాపించగలను" అనే ఆత్మధైర్యం ఆ మహాపురుషునకు కలిగింది "దేశరాష్ట్ర సమితి - దినుగు లెస్స" అనే విషయం ఆయన గ్రహించాడు దేశరాష్ట్రముల సమితిలో కెల్ల తెనుగుసీమ లెస్స అని గ్రహించాడు తెనుగుసీమ అంటే శ్యమంతకమణి అది ఎవరి అధీనంలో ఉంటుందో అట్టి వారి అభీష్టసిద్ధికి విఘ్నేశ్వరుడు కూడా విఘ్నములు కల్పింపజాలడని ఆ నాట రాయలు గ్రహించాడు అందుకనే అల్లసాని పెద్దన్న గారి విఘ్నేశ్వర ప్రార్థన నిర్విఘ్నంగా ఫలించింది. రాయల ప్రతాపం అప్రతీపంగా కొనసాగింది

ఒకవేళ విఘ్నేశ్వరునకే స్వీయసంకల్పాభీష్టములు కొనసాగక ఆశాభంగములు కలిగితే కలుగునేమో గాని మా కృష్ణరాయలకు "తెనుగు' అంటేను, "తెనుగుసీమ"అంటేను అభిమానం ఆత్మశుద్ధిగా ఉన్నంత కాలమూ అభీష్టసిద్ధికి లోటు లేదనెడి అభయం కవి హృదయం యీ హృద్యమైన పద్యంలో ప్రతిఫలిస్తోంది

పార్వతి ఒడిలో కూర్చుండి పాలు త్రాగుతూ ఉన్నటువంటి విఘ్ననాయకుడు రెండోవైపున కూడా తాను పాలు త్రాగుటకు అనువైన మాతృ స్తనము మరొకటి ఉన్నదని ఆశపడ్డాడు కాని అటువంటిది ఏదిన్నీ లభించక, ఆ ప్రయత్నంలో అతనికి విఘ్నం సంభవించింది. ఒంటకాలి మీద తపస్సు చేసినట్లుగా ఎంతసేపు త్రాగినా తన తల్లివద్ద ఏకపార్శ్వ స్తన్యమే గాని అన్యము లేదని అప్పుడు తెలిసికొని తన ఆశ నిరాశ చేసికొన్నాడు ప్రక్క వైపున శివుని మెడలో వ్రేలాడు సర్పరాజమును తామరతూడు అనుకొని ఆడుకొనబోయి మరొకమారు ఆశాభంగము పొందవలసి వచ్చింది ఈవిధంగా అబ్బాయిగారికి రెండు సార్లు పరాభవనామ సంవత్సరం ప్రాప్తించింది ఈ రెండూ ఆశాభంగములే

ఆశాభంగములంటేనే విఘ్నాలు. విఘ్నాలు అంటేనే ఆశాభంగములు. అటువంటి విఘ్నములు విఘ్నేశ్వరుని జీవితంలోకూడా ఉండకగానవు అని పెద్దన్న గారు అచ్చుగుద్దినట్లుగా సరసులు మెచ్చునట్లుగా మచ్చుకు మాపించారు. అర్ధనారీశ్వర విగ్రహం అంటే అది శైవానికి సంబంధించిన మూర్తి కాని వైష్ణవభక్తి ప్రపత్తులతో, అద్దంకి తాతాచార్యులుగారితో, తిరుచూర్ణోర్ధ్వ త్రిపుండ్రములతో విరాజిల్లుచున్న రాయలవారి ఆస్థానములో యీ విశమైన హాస్యాంతర్గర్భిత ఉత్పలమాలను పెద్దన్న గారు చదివినప్పుడు పెద్దలందరూ పెద్దగా ఆనందించి ఉంటారు అయితే పార్వతీపుత్రుని విషయంలో మాత్రమే యిటువంటి భ్రమ, భ్రాంతి, పొరబాటు, గ్రహపాటు జరిగినదన్నట్లుగా తాను వర్ణించలేదనియూ, తాను రచించిన మనుచరిత్రలోని మొట్ట మొదటిపద్యములో అనగా "శ్రీవక్షోజకురంగనాభ మెదపై జెన్నొంద" అనే పద్యంలో శ్రీమహావిష్ణువునూగూర్చి కూడా కొంత చిత్రవిభ్రాంతి కలిగినదన్నాడు శ్రీమహావిష్ణువుయొక్క వక్షస్థలంమీద ఉన్నటువంటి కస్తూరిజిడ్డును సనకసనందనాది మహామునులు చూచి, ఆమహావిష్ణువు తన వక్షస్థలంమీద లక్ష్మీదేవినే కాకుండా సవతియైన భూదేవిని కూడా మకాముగా ఉంచుకొన్నాడా అని భ్రమపడ్డారు. అటువంటి"రాజీవాక్షుండు కృతరార్థుజేయు శుభదృష్టిన్ గృష్ణరాయాధిపున్" అని చమత్కరించి, సనకసనందనాది మహామునులుకూడా విఘ్నేశ్వరునివలెనే కొంత తికమకపడ్డా

రని చూపించాడు. కాబట్టి రాయలవారి ఆస్థానంలో శైవులెవరైనా యీ విఘ్నేశ్వర ప్రార్థననుగూర్చి ఆక్షేపించుటకుకూడా అవకాశం లేదు. ఎందుకంటే, ఈ కవి తన వాక్చాతుర్యంలో శివకేశవుల యెడల లవలేశమైనా పక్షపాతబుద్ధి చూపలేదని చూపించి, తనయందు తప్పులేదని తప్పించుకోవచ్చు పెద్దన్నగారిగురువు శఠగోపయతి అని తెలిసింది మొట్టమొదట పెద్దన్నగారు స్మార్తుడు తర్వాత వైష్ణవం పుచ్చుకొన్నాడు కనుక ఈయనది మధ్యవైష్ణవం

కృష్ణరాయలవారు కన్నడంవాడు కాని ఆంధ్రమహాసామ్రాజ్యాధిపతిగా కీర్తి సంపాదించాడు అటు పెద్దన్నగారి స్మార్త వైష్ణవ సంపర్కం అర్ధనారీశ్వరంవంటిదే ఇటు కృష్ణరాయలవారి కర్నాటాంధ్రాభిమాన వాసనలుకూడా అర్ధనారీశ్వరం వంటివే

ఏమైనప్పటికి, ఆంధ్రరాష్ట్రానికి ఆయన అగ్రస్థానం యిచ్చినవాడు కావడంచేతనే, ఆనాటివిశాలాంధ్రరాష్ట్రం రాయలసామ్రాజ్యానికి ఆజ్యం పోసి, అఖండతేజోవిరాజమానంగా చేసింది బ్రిటిష్ సామ్రాజ్యానికి భారతదేశంమకుటం గావుండేది అదేవిధంగా రాయలవారి సామ్రాజ్యానికి ఆంధ్రదేశం అసలైన గుండెకాయ అయన తాగింది తెనుగుతల్లి రొమ్ముపాలు. ఒకవైపున తాను తెనుగుతల్లి పాలుత్రాగి తన్మూలమున ప్రబలుడవుతూ, రెండవవైపున ఎంత వెతకిచూచినా తన అధికార బలాధారమైన మరొక క్షీరధార కన్పించలేదుసరిగదా, ఎప్పటికప్పుడు బుసకొట్టుతూ పడగపైకెత్తి చలిస్తూ కప్పములు గట్టెడి సప్పముల వంటి రాజులే ఆయనకు కన్పించారు

విఘ్ననాయకుడు స్వయంగా అనేక ఆశాభంగములు తన ప్రారంభదశలోనే అనుభవించాడు అనేక విఘ్నాలు విఘ్నేశ్వరునకే రావచ్చు కాని, ఆ విఘ్నేశ్వరుడే అనేక విఘ్నములకు విఘ్నం కల్పించి ఆ విఘ్నములనన్నింటిని కోరలు తీసినపాముల వలె చేసి సర్వగణములకు నాయకుడై వినాయకుడైనాడు అతడే గణనాయకుడు. ఒక్కొక్క గణం ఒక్కొక్కని గణుతించి నాయకుడుగా ఎన్నుకోవచ్చును ఇదే గణతంత్రం పద్ధతి ఈ గణతంత్రంపద్ధతి ప్రకారంగాఒక్క చిన్నవోటుకాగితంముక్కతో నాయకత్వం లభిస్తుంది ఈ నాయకత్వం లభించితర్వాత ఉండ్రాళ్లమీదకు దండెత్తవచ్చు ఎన్ని ఉండ్రాళ్లనైనా స్వాహా చేయవచ్చు నాయకత్వానికి వచ్చిన అపవాద ఏమిటంటే ఈ వినాయకునకు లంబోదరం ఉంటుందనిన్నీ, ఎంత తిన్నా కడుపు నిండదనిన్నీ, ఏ కవిచంద్రుడైనా ఏ సత్యహరిశ్చంద్రుడైనా చూచి అల్లరిచేస్తే, ఆ చంద్రునకు ఈ వినాయకుడు శాపంపెట్టి, వినాయక కథామాహాత్మ్యం ప్రజలు ముందుగా పారాయణం చేయకుండా ఆ కవిచంద్రుని ఆ సత్యహరిశ్చంద్రుని ముఖం కూడా ఎవరూ చూడకూడదని శాసిస్తాడు కాబట్టి అటువంటిగణతంత్ర విధానంవల్లనే అనగా పార్టీ ప్రభుత్వ విధానంవల్ల వినాయకునకు అధికారం, నాయకత్వం లభించింది. ఇదంతా దేనివల్ల అంటే, చిట్టెలుకకంటె చిన్నదైన వోటు చీటిముక్క ఎక్కువగా లభించడం వల్లనే ఈ చిట్టెలుకవంటి చిన్న వోటు కాగితం మీదనే ఆధారపడి ఉంది వినాయకుని నాయకత్వం అంతా. అదే వినాయకుని వాహనం. గణములు అనబడే నియోజక వర్గములు వోట్లు వేస్తేనే గణనాయకుడు చిట్టచివరకు ఉండ్రాళ్లమీద దండెత్తడం సాధ్యమవుతుంది ఈ గణతంత్రవిధానం నిర్విఘ్నంగా కొనసాగవలెనంటే అందులో ఆరితేరిన గణాధిపతిని ఆరాధించడమే ఆంధ్రలోకానికి అత్యవసరం - అవశ్యకర్తవ్యం. అభినవ ఆంధ్రరాష్ట్ర అమాత్యవర్గప్రభుత్వం అవిఘ్నంగా అమలు జరుగవలెననేది అఖిలాంధ్రలోకాభీష్టము కనుక "గజాస్యుని కొల్తు నభీష్టసిద్ధికిన్" అని అల్లసాని పెద్దన్నగారు ఆనాటి కృష్ణదేవరాయలవారి కాలంలో స్మరించారు కాని, అది నేడు "విస్మృత సామ్రాజ్యం" (*Forgotten Empire*) చరిత్రగా స్మరించవలసి వచ్చినది.

మరొక్కమారు ఆంధ్రగణనాయకుడు అఖండ ప్రతిభతో అఖిలభారత ప్రశస్తి పొందవలెననే సంకల్పావకాశం కల్పించబడింది కాబట్ట ఆంధ్ర దేశాభ్యుదయాభివృద్ధికీ, ఆంధ్రలోకాభీష్టసిద్ధికీ, "గణాధిపతయే నమః" అని ఆంధ్రు లందరూ ఆరాధించవలసిన పర్వదినాన్ని ఆ బాలగోపాలం సద్వినియోగం చెయ్యాలి

అవిఘ్నమస్తు శుభమస్తు ★



## మా పాఠకులకు మరొక కొత్త ఆకర్షణ

# ఆంధ్రపత్రిక

### సచిత్ర వారపత్రిక

## విక్టర్ హ్యూగో ప్రసిద్ధ నవల అనువాదం

ఫ్రెంచి నవలా రచయిత విక్టర్ హ్యూగో నవలల్లో ప్రసిద్ధమైన "హంచ్ బాక్ ఆఫ్ నాటర్ డామ్" (Hunchback of Notre Dame) నవల ఆంధ్రానువాదం త్వరలో మా వారపత్రికలో సీరియల్ గా ప్రచురింపబడ నున్నదని తెలుపుటకు సంతసిస్తున్నాము మా సీరియల్స్ అన్నిటినీ పాఠకులు ఆదరించినట్లే ఈ కొత్త సీరియల్ ను కూడా ఆదరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

# మొదటి జీతం

ఆనాడు మొదటి తారీఖు రంగారావు తన కొచ్చిన రెండు వందల రూపాయల జీతాన్ని కోటుజోబీలో వేసుకొని, గదిలోంచి బయటికొచ్చి, ఆఫీసు వరాండాలో నిలుచున్నాడు కోటు లోపలి జేబులో వున్న రూపాయల్ని తాకుతూ యేదో అవ్యక్తానందాన్ని అనుభవిస్తున్నాడు సిగరెట్టు తీసి వెలిగించి, కోటు గుండీలు సరిపెట్టి, రూపాయలున్న జేబు చేతితో అదిమిపట్ట—అతనిలో ఆ చిరునవ్వే లేకుంటే, అతనేదో గుండెనొప్పితో బాధపడుతున్నాడనుకోవచ్చు—సిగరెట్టు పొగ వదులుతూ ఆలోచించసాగాడు. ఆనందంతో అతని పెదిమలు వణుకుతున్నాయి

ఇన్నాళ్లకు తనూ వొక అర్జనాపరుడయ్యాడు తలిదండ్రులు కష్టపడి చదువు చెప్పించినందుకు, తనూ కష్టపడి, బి కామ్ పాసయి, యేణ్ణర్ధం నిరుద్యోగుల జాబితాలో పడివుండి, యీనాటికి మొదటసారిగా జీతం అందుకునే భాగ్యం లభించినందుకు అతడు పరవశుడౌతున్నాడు అతని ఆలోచన అంతా యీ మొదట జీతాన్ని యెలా ఖర్చుచేయాలా అని ఆ రెండువందలతో తల్లిపై తనకున్న మమకారాన్ని, తండ్రిపట్ల గౌరవాన్ని, భార్యపై వున్న ప్రేమనూ, తమ్ముడిమీద వాత్సల్యాన్ని, బిడ్డమీద వున్న ఆదరణనూ, స్నేహితుల పైని అభిమానాన్నీ వెల్లడి చేయాలనుకుంటున్నాడు ఆ రెండు వందలు చెక్కు చెదరకుండా తల్లికిస్తే సంతోషిస్తుంది కాని అందువల్ల తన కెవరెవరిపై యెలాంటి ప్రేమ వుందో వ్యక్తంకాదు అని ఆలోచిస్తున్నాడు. తిన్నగా యింటికి వెళ్లడమా, లేక బజారు వెళ్ళి అక్కడినుండి యింటికి పోవడమా అని. ఇప్పుడు తనూ వొక ప్రయోజకుడు ఇదే అతని మొదటి జీతం అలాంటప్పుడు యీ జీతంతో తను సంతోషించడమే కాక అందరినీ ఆనందపరచాలి అదీ అతని అభిప్రాయం

"ఏంరోయ్ వున్నావా! జీతం తీసుకొని వుడాయించావనుకున్నాను మొదటి జీతం కదూ ట్రీట్ యివ్వవూ? ఏ సినిమాకి వెడదాం?" అన్నాడు పర్సు జేబులో పెట్టుకొంటూ బయట కొచ్చిన స్నేహితుడు

రంగారావు నవ్వి "యేడ్చావులే! ఇంటి దగ్గిర నీకంటే యెక్కువ అదుర్దాపడేవాళ్లు డజను మంది వున్నారు ఇవాళ కాదు రేపు" అన్నాడు అతను వెళ్ళిపోయాడు. రంగారావు అలాగే గుండె చేత్తో పట్టుకొని బస్సుస్టాండువేపు దారితీశాడు మెల్లిగా

"బొమ్మిరెడ్డి"

"చిన్నప్పుడు నాకు రోజా సిల్కు చీరలంటే మహా ప్రీతి అదొక్కటి తప్ప రంగు చీరలుకట్టేదాన్ని కాదు తెలుపు మనిషికి అందం యిస్తుంది అయినా యీ యింటలో ఎప్పుడు అడగను పెట్టానో ఓ మంచి చీర కట్టయెరుగనుకదా ఎప్పుడూ యీ ముతకగుడ్డలే కదా" అని యింటిలో వచ్చీ వచ్చిన ప్రతి రోజూ తల్లి అనే మాటలూ,

"ఏమంటూ వచ్చానో ఓ నాడయినా నాలుగు మల్లెపూవు లెరగను"అంటూ పడకటింటలో భార్య దెప్పిపొడిచే మాటలూ,

"ఏం దరిద్రంరా యిది పాతపత్రికలు చదువుకుందామన్నా కళ్ళు లేవాయె! సినవ అద్దాలకు పదిహేను రూపాయలు మిగలుబాటు కాదు ఏం ఖర్మం?" అంటూ పొద్దుటా సాయంత్రం సణుగుతూవుండే తండ్రి మాటలు

"ఎన్ని పుస్తకాలని లైబ్రరీలోంచి తెచ్చుకునేదన్నయ్యా? కనీసం ఆ ఎకనామిక్స్ టెక్స్టులన్నా లేకుంటే యెలా పాసయ్యేది?" అని విసుక్కునే తమ్ముడిమాటలూ రంగారావు చెవుల్లో రొదపెట్టాయి చంటపిల్ల యేమీ చెప్పలేదు కనుక, తన బిడ్డ కేమి ఆటవస్తువులు తీసుకెళుతే ఆ యేణ్ణర్ధం "పాప" ముచ్చటపడి ఆడుకుంటుందో ఆలోచించసాగాడ ఎవరెవరికే లోటులున్నాయో వాటి నన్నిటినీ యీ మొదటి జీతంతో తీర్చివేసి, యిక యెప్పుడూ తను నిక్కచ్చిగా రెండువందలు తెస్తూవుంటాడు గనుక, యింటిలో కలతలు లేకుండా చేయాలనుకొన్నాడు

తన కేమి కావాలో ఆలోచించుకొన్నాడు "నీకిప్పు డేమీ అక్కరలేదు తేతరువాత మెల్లిమెల్లిగా సర్దుకోవచ్చు. పద అన్నీ తీసుకొని యింటికి పద తొందరగా పద' అని మనస్సు హెచ్చరించింది

అనకున్నట్టు తల్లికి మామిడిపిందెలుగల జరీ అంచు తెల్లటసిల్కు చీర, తండ్రికి కళ్లద్దాలు, తమ్ముడికి పుస్తకాలు, బిడ్డకు బొమ్మలపెట్టె, భార్యకు మూచి అర్ధసేరు మల్లెపూలు, మొత్తం తొంబది యెనిమిది రూపాయలు ఖర్చుచేసి, తాను కూడా ఓ వుద్యోగికదా అన్న గర్వంతో, తన మొదటి జీతంతో యింటిలో వాళ్ళందరినీ సంతృప్తి పరచగలను కదా అన్న ధీమాతో యిల్లు చేరుకున్నాడు రంగారావు

కాని యింట్లో అడుగు పెట్టీ పెట్టకముందే అతని ఉత్సాహం అంతరించింది. లోపల యేదో రగడ జరుగుతూ వుంది ఆ యింటలో గోల లేని రోజెప్పుడు!! అయినా యింటిలోకి పోడానికి రంగారావు కాళ్లాడలేదు తెలియని దిగులు, అర్థంకాని భయం, అతన్ని ఆవేశించాయి తానా నాడెంత ఆనందంగా గడుపుదామనుకున్నాడు? అందరినీ యెంత సంతోషపరచాలనుకున్నాడు? అయినా యిప్పుడీ వేళ యీ గోలేమిటి? తనకోసం, తన మొదటి జీతంకోసం యింటిల్లిపాదీ యెదురు చూస్తూ ఉవ్విళ్ళూరుతూ వుంటారనుకున్నాడే! రంగారావు తనకు తానే యెంతో ధైర్యం చెప్పుకున్నాడు తన్ను చూసి వాళ్ళందరూ రగడ మాని చుట్టూ మూగుతారని కాని అతనికి లోపలి కెళ్లడానికి మనస్కరించటం లేదు వాకిలి తలుపు కానుకొని లోపలినుంచివినవస్తూన్న మాటలు వింటూ నిలుచున్నాడు

"అబ్బో యీమె కెంత కళ్లు నెత్తికెక్కినాయనకున్నారు, మొగుడికి వుద్యోగం దొరికిందని అంత మిడిసిపాటా! పెద్దదాన్ని నేనొక లెక్కలో వున్నానా! కళ్లు పొరలెక్కాయి" తల్లి గొంతుక

"అమ్మాయి తోడు నిజంగా నాకు జ్ఞాపకం లేదండీ" భార్య గొంతుక



"అమ్మడు మరిచి పోయిందే అనుకో! అయినా నీ చేతి కష్టమేముందని? యింటి కంతా అధికారిణివి "

"చాల్లే వూరుకోండురూ? అంతా మహా తెలిసినట్టు చెప్పుకొస్తున్నారు దాన్ని వెనకేసుకొని అమ్మాయెంత కుతంత్రం ఇక మొగుడు నెలనెలా జీతం తెచ్చి మమ్మల్ని పోషిస్తూ వుంటే యిక యీ యింటిలో వుండగలమా? ఇంత కోరకమా " మళ్ళీ భర్త మాటలను అణగదొక్కి పైకి అరుస్తూవున్న తల్లి మాటలు

"అది కాదే వదినకు జ్ఞాపకంలేక నెయ్యి వడ్డించలేదంటోంది కదే! ఏం మనింటలో నెయ్యి రోజూ వుంటుందా యేం, అలవాటుగా వడ్డించుకోటానికి? వడ్డించటానికి గాని? యేదో మజిగ చేసి నాలుగు రోజులు నిలువవుంచి వెన్న కాచుకొని ఓ రోజు యింతింత వేసుకొంటామాయె ఇంతవరకామె వడ్డించటం నీవు తినటం అన్నది లేదు ఇవేళే యింత కావాలా?" అన్నాడు తమ్ముడు వున్న విషయాన్ని కుల్లంకుల్లా చేస్తూ.

"అదేరా నేనూ అనేది రోజూ వుంటే నే నెందుకు కరుస్తాను లేని నాడు లేదాయె, వున్న నాడయినా యింత, యింతలో యింత యివా వెయ్యొద్దూ? అబ్బో దాని గుణం మీకేమి తెలుస్తుంది నాకు వేస్తే మొగుడికి యెక్కడ తక్కువౌతుందో అని దాని బాధ " అంటోంది తల్లి

ఇంటి పరిస్థితులు బాగా తెలిసిన రంగారావుకి యీ తల్లి శోకాలు తీస్తుందని తెలిసిపోయింది ఇక రెండు మూడు రోజుల వరకు ఆ యిల్లు యిల్లుగాదు, మనుష్యులు మనుష్యులుగా వుండరు ఏ రాగయినా సర్దిచెబుదామని మెల్లిగా, దొంగలా నక్కుతూ ముందు తన గదివైపు నడిచాడు తన అభిప్రాయం, తాను తెచ్చిన వస్తువులు వారి కంటబడకుండా వుంచి, అందరు చల్లబడ్డ తరువాత పేరుపేరునా పంచి యివ్వాలని పాపం రంగారావు యెంత వుత్సాహంతో యింటికి వచ్చాడో అంతకు రెట్టింపు నీరసించిపోయాడు ఇంత చేస్తే యింటిలో గలాభా తనమూలంగానే వచ్చినట్లుంది భార్యని ఆడిపోసుకున్నాడు మనసులో తాను కుదురుగా అంటూ మొదటి జీతంతో యింటికి వస్తూవుంటే వీళ్ళు యేడ్పులకు దిగేట్టున్నారేమిటి ఖర్మం అనుకున్నాడు



ఇంత ఖర్చు చేసి యేంలాభం!" అన్నాడు కళ్ళద్దాలతో లోపలనుంచి తిరిగినవ తండ్రి.

నక్కి నక్కి తన గదిలోకి పోతూన్న కొడుకుని చూచింది తల్లి.

"అగుగో వచ్చాడు ప్రయోజకుడు మొదటి తారీఖు కదూ! జీతం తీసుకొని పెళ్ళానికి చీరలూ, మిఠాయిలూ, తీసుకొచ్చుకున్నాడు అదో తన గదిలోకే పోతున్నాడు" అంది రంగారావు మనస్సు చివుక్కుమన్నది చఱ్రున వెనక్కు తిరిగి అందరూవున్న హాలులోకి వచ్చాడు ఒళ్లు తెలియని కోపం వచ్చింది

"నా పెళ్ళాం పిల్లలకేం తెచ్చుకోలేదు" అన్నాడు కోపంగా. మళ్లీ అంతలోకే తమాయించుకొని, లేని నవ్వు తెచ్చుకుని "అమ్మకి తెల్ల చీరంటే యిష్టం, నాన్నకి కళ్లజోడు, తమ్ముడికి పుస్తకాలు, అందరికి అన్నీ తెచ్చాను; యీ మిఠాయిపొట్లం అందరికీను. ఇక నాకు మిగిలిం దేమీ లేదు" అన్నాడు తొందర తొందరగా యెవరిది వాళ్లకిస్తూ

తండ్రి కళ్ళజోడు తీ వి, కంటి కొనిందీ లేందీ తెలుసుకోడానికి కుడిచేతి రేఖలు చూచుకొని, మసకమసకగా వున్నందుకు, తీసి పంచెఅంచుతో తుడుస్తూ బయటికి వెళ్ళాడు, పుస్తక మేదయినా చదివి చూడ్డానికి తమ్ముడు పుస్తకాలు తీసుకొన్నాడు. భార్య తన ముఖంలోకి రెగా దిగా చూచింది కోపంగా. ఆమె యెందుకలా చూచిందో అర్థమయింది

"ఎంత ప్రేమరా నాయనా, తల్లికి తెల్ల సిల్కుచీర యిష్టం అని జరీ అంచు చీర యాభై పెటి తెచ్చావా! ఈ నాటకం యీ రోజునుంచె మొదలా బాబు? ఏదీ పది మందినీ యీ మాట అడిగిచూద్దాం యేమంటారో? ఏం తెలిబిరా. యాభై యేళ్ళ ముసలిదాన్ని సిల్కుచీర కట్టి కులుకుతాననేనా నీవు తెచ్చింది? ఏం. నీ పెళ్లానికి తెచ్చుకున్నానంటె కొడతానా కొరుక్కుతింటానా! ఈ మాటంటే యెవ్వరయినా నవ్వుతారురా బాబూ ఏలాగూ నేను కట్టనని నీకు తెలుసు. ఇది యేవిధంగానూ నీ భార్యకే దక్కుతుందని తెలుసు. అందుకే యీ మాట అడ్డం వేస్తున్నావ్ నాయనా నీ చీర వద్దు. నీకూ నీజీతానికీ యేనాడో నీళ్ళు వదులుకున్నాను. నీ విలా చేస్తావని నాకు తెలుసు" అని తల్లి పాఠం వప్పజెప్పినట్టు, అనదలుచుకున్న నాలుగు మాటలూ విసిరింది

"*You have not done a good thing brother*" "ఇది మంచిపని కాదన్నయ్యా" అన్నాడు తమ్ముడు

"ఇంత కర్చు చేసి యేం లాభంరా?" అన్నాడు లోపలికి కళ్లద్దాలతో తిరిగి వచ్చిన తండ్రి

ఇక అక్కడ నిలుచో లేక పోయాడు రంగారావు గదిలోకొచ్చి తల పట్టుకొని మంచంమీద కూలబడ్డాడు వెంటనే వచ్చిన భార్య "తల్లికి తెచ్చారు, తండ్రికి తెచ్చుకున్నారు, తమ్ముడి కిచ్చుకున్నారు. వాళ్లంతా మీవాళ్లు కాబట్టి నే నెవతినని నాకు తెస్తారు" అంది రంగారావు ఆమె మాటలయినా పూర్తికాక మునుపే చఱ్రున లేచి యీ చెంపా ఆ చెంప టఫీ టఫీ వాయించి, మెడ పట్టి, భార్యను బయటికి గెంటి, దబాలున తలుపేసుకుని, మంచంపై బడ్డాడు.

రంగారావు మనస్సు వికావికలయింది. కోపం ముంచుకొస్తూంది దాన్ని గొంతులో బలవంతంగా అణిచివుంచాడు. వళ్లు వణుకుతూ వుంది ఏమీ ఆలోచించలేదు. మంచానికి బల్లిలా కరుచుకొని, రెండు చేతుల్తో ముఖం కప్పుకొని యేడ్చాడు అంతకంటే అత నేమీ చేయలేకపోయాడు.

చాలా సేపటకి రంగారావుకి, అస్పష్టంగా, కలలో వినవచ్చినట్టు—వినపడీ, వినపడకుండా-మాటలు చెవుల్లో దూరడం మొదలెట్టాయి లేచి కూర్చుని వినాలని ప్రయత్నం కాని లేవలేడు విన్న వాటికి తగిన జవాబులే యివ్వా లనుకుంటాడు, యివ్వగల ననిపిస్తుంది, కాని నోరు పెగలదు కొంత యీ ప్రపంచంలో, జాగ్రదవస్థలో వున్నట్టూ, మరో కొంతమరో ప్రపంచంలో వున్నటూ ఉందతనికి.

"కడుపు కట్టుకుని, తినీ తినక, కష్టపడి, చదువు చెప్పించినందుకు మంచి శాస్తి చేస్తున్నాడు . వాడి జీతం బొగ్గులు కొను వాడి కష్టం తినాలని యెవరేడ్చారు? నాకని సిల్కుచీర తేడానికి వాడికి సిగ్గెలా లేకపోయిందో! సిల్కు చీరట ఊఁ సిల్కుచీర. కన్న కొడుకే యీవిధంగా తయారయితే, పరాయిపిల్ల యేమాదరిస్తుంది అందుకే అది అలా సాధిస్తోంది, వీడిలా పీడిస్తున్నాడు వాడిదంతా ఓ యెత్తు నౌకరీ దొరికిందిగా యింకేం. యేవిధంగానైనా లేచిపోయి వేరే వుండాలని వుపాయం నెపం నాపైన పెట్టాలనుకుంటారు గయ్యాళి అత్త కోడలిని చంపు

(55-వ పేజీ చూడండి)

# వెల్లువ

పొంగి పోయిన ఆ మహానది మట్టు ప్రక్కలనున్న పట్టణాల్నీ, పల్లెల్నీ నాశనం చేసుకుంటూ మహోధృతంగా సాగిపోతున్నది ముందుకు పోతున్నది ఆ వేగానికి అడ్డులేదు ఆ నదీ ప్రవాహ వేగాన్ని ఆపగల శక్తి లేదు పరుగెత్తే ఆ నదీమతల్లి పక్షపాతం లేకుండా పంటపైరుల్ని, పశువుల్ని, పాకల్నీ భవనాల్నీ కూలద్రోసుకుంటూ, నురుగలు కక్కుకుంటూ వస్తున్నది క్రిమి కీటకాదుల దగ్గిర్నుంచీ, మానవులవరకూ లెక్కలేకుండా శవాలని నదీగర్భంలో కలిపేస్తున్నది నీటిపై తేలుతున్న తెల్లని నురుగ నదివేగాన్ని కొల్చి మరీ చెపుతున్నది చూపరుల కళ్ళముందునుంచే పెద్ద పెద్ద చెట్లు, శవాలు, యిళ్లు కొట్టుకొని పోతున్నాయి

నీటి మట్టం భయంకరంగా పెరిగిపోయింది మట్టం యికయే మాత్రం పెరిగినా, నది ప్రక్క నేవున్న ఒక పెద్దపట్టణం కట్టకు గండి పడుతుంది గండిపడితే పట్టణం మరి కనిపించదు కాని పట్టణవాసుల కా సంగతి తెలీదు అందరూ పరుగెత్తే ప్రవాహ వేగాన్ని చూసి మురిసిపోతున్నారు కేరింతాలు కొడుతున్నారు చప్పట్లు చరుస్తున్నారు గట్టుని ఒరుస్తున్న నీటని, గట్టుమీదనుంచే, చేతుల్లోకి తీసుకుని అందరికీ చూపిస్తున్నారు చూస్తుండగానే నీటివేగం హెచ్చిపోతున్నది వేగంతో పాటు మట్టమున్నూ హెచ్చుతున్నది మట్టంతోపాటు చూసేవాళ్ల అట్టహాసాలున్నూ మారిపోతున్నవి ఆరోజున పట్టణంలో యిళ్ళన్నీ ఖాళీగా వెలవెలబోతున్నాయ్ రాబోతున్న ఆపద వాటికి తెలుసేమో అన్నట్లు - ఏ యింటకీ కళ లేదు ప్రజలంతా నదిగట్టున తండోపతండాలుగా మూగుతున్నారు

అందరి ముఖాలలోనూ ఆశ్చర్యం, ఆనందం, అయోమయం అన్నీ కనిపిస్తున్నాయ్ ఎక్కడ చూడపడితే అక్కడ గుంపులు గుంపులుగా జనం వింత వింత చేష్టలు చేస్తూ, చేతులాడించేస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారు అందులో డబ్బైయేళ్లు పైబడ్డ ఒకాయన మిగతా వాళ్ళతో - తన జీవితంలో యింతవరకూ యిలాంటి వరదల్ని చూళ్లేదన్నాడు అక్కడున్న కుఱ్ఱకారు 'అబ్బా' అన్నారు తాతగారు మళ్ళీ అందుకున్నారు 'ఒకసారొచ్చింది కానీ' అని సాగదీసి 'అయితే యేం, యింత రాలేదు' అని చప్పరించారు కుఱ్ఱాళ్ళు చప్పట్లు చరిచారు ఎందుకూ? డెబ్బయ్యేళ్ళ తాతగారే తన చిన్నతనంలో చూడలేకపోయిన వరద, తను చిన్నతనంలో చూసేస్తున్నామని



"బదరీనాథ్"

ఇంతలో ఓ కుఱ్ఱాడు కళ్లు పెద్దవిచేసి, ఒళ్లు విప్పారించి రెండు చేతులూ బారజాపి 'అయ్యా బాబోయ్' అని గావుకేక పెట్టాడు హడిలిపోయి అందరూ అటు వేపు తిరిగారు "చూడండి - ఎంత పెద్ద చెట్టో" అన్నాడు - ఎన్ని మైళ్ళ వేగంతోనో తెలియకుండా కొట్టుకుపోతున్న ఓ పెద్ద మఱ్ఱి చెట్టుని చూపించి

నీళ్ళ దగ్గరున్న పల్లె కుఱ్ఱాళ్ళు తెప్పల్తోసహా నీళ్లలో కురికారు ఉరికిన వాళ్ళిద్దరు ఇద్దరికీ ఆ చెట్టుని పట్టుకోవాలనే వుంది ఇద్దరూ వేగంగానే యీదడానికి ప్రయత్నిస్తున్నారు గట్టున మరోవంద మంది మనుష్యులు చేరి, టిక్కట్టులేని యీ యీత పందేన్ని, చేజిక్కిన అవకాశం జారవిడుచుకోకుండా అత్యాతృతతో చూస్తున్నారు ప్రవాహంలో పడ్డ యిద్దరు కుర్రాళ్ళూ ఘటికులే అందుచేతనే యిద్దరూ ఆ చెట్టుని ఒక్కసారే పట్టుకున్నారు అనుకున్నట్లే వాళ్ళు జుట్టూ జుట్టూ కూడా పట్టుకోవలసి వచ్చింది ఇదంతా ప్రవహిస్తున్న నీళ్ళల్లోనే వాళ్లిద్దరూ ఆ విధంగా ముష్టియుద్ధం చేస్తున్న సమయంలో ఆ చెట్టు తొఱ్ఱలోనుంచి పెద్ద తాచుపాము ఒకటి బుసలు కొట్టుకుంటూ యివతలికి వచ్చేసరికి, తగువు కాస్తా తీరిపోయి, ప్రాణాలు కాస్తా అఱచేతిలో పెట్టుకొని ఒడ్డుకీదుకొచ్చారా కుర్రకుంకలిద్దరూ. బ్రిటిష్ ఛానల్ దాటిన పెద్దతగాళ్లని చూసినట్టు అందరూ వాళ్లకేసి చూడసాగేరు ఇంతలో యేవో చిన్నచిన్న దుంగలు కొట్టుకురావడం చూసి, అందరూ చూస్తూండగానే వాళ్లిద్దరూ తెప్పల్తో సహా ప్రవాహంలో దూకి యీదుకొంటూపోయారు. నేను ముందుకు సాగిపోయి మరో గుంపులో తలదూర్చాను. అక్కడున్న వాళ్ళందరూ యిరవైయేళ్లు దాటని యువకులే. నలుగురైదుగురు పదేళ్లవాళ్ళున్నూ వుంటారు వాళ్లముందీ యిరవైయేళ్లవాళ్ళు పెద్ద అనుభవజ్ఞులైపోయారు ఓ పదేళ్లవాడు నీళ్ల దగ్గరకెళ్లబోతోంటే - వాళ్లన్నయ్యగారను - వెనక్కాలే వెళ్ళి ఒక్కటంటించి వెనక్కిట్టుకు నీడ్చేశాడు. వాడేడ్చుకుంటూ వెళ్ళిపోతూంటే 'కుఱ్ఱాళ్ళకసలు చెప్పలేంరా!' అని వాళ్లన్నయ్య మిగతా వాళ్లతో అంటున్నాడు - అక్కడికి తను మహాపెద్దవాడైనట్లు వాళ్లంతా అనుకుంటున్నారు - "ఇంత పెద్ద వరద లెప్పుడూ రాలేట్ట నిజంగా మనం చాలా అదృష్టవంతులం, యింత పెద్ద వరదల్ని చూడగలిగినందుకు"

ఇలాగే యెన్నో గుంపులు రకరకాలుగా మాట్లాడుకుంటున్నారు గట్టుమీద జన ప్రవాహం గట్టుక్రింద జలప్రవాహం చాలా జోరుగా సాగుతున్నాయ్ గట్టు మించి కార్లు, గట్టుప్రక్కనుంచి స్టీమర్లు, పందేలేసుకున్నట్లు ప్రక్క ప్రక్కల్నుంచే పరుగెడుతున్నై మధ్య మధ్య, వరద యింకా రాబోతుందన్న సూచనగా వానజల్లు కురిసేది చూడటానికొచ్చిన జనం ప్రక్కనున్న లాంచీలలో దూరిపోయేవారు ఇంతలో జల్లు ఆగిపోయేది గట్టుప్రక్కనున్న చెట్లు, నదిలో కొట్టుకుపోయే చెట్లను చూసి, సానుభూతి సూచకంగా కన్నీటి చుక్కల్ని - అవే - నీటి చుక్కల్ని కురిపించేవి కొందరన్నారూ - తప్పక మరికొన్ని క్షణాల్లో గట్టుమించి నీరు పారిపోయి ఊళ్లో ప్రవహిస్తుందీ - అని. దాన్ని ఖండించేందుకు ముందుకెవరూ మాత్రం రాలేకపోయారు అంచేతనే నేనూ 'అవునేమో' అనుకునేవాణ్ని. నేనే కాదు, హెచ్చుతూన్న నీటిమట్టాన్ని చూసిన ప్రతివాళ్లూ అలానే అనుకున్నారు. కాని యెవ్వరూ ఊళ్లో కొస్తుందనికానీ, యిళ్లని ముంచేస్తుందనికానీ ఒక్కళ్లూ అనుకోలేదు ఎలా అనుకుంటారు? ఇంతకు ముందలాంటి అనుభవం లేనప్పుడు. కాని నీరుమాత్రం జోరుగా, చెప్పలేనంత జోరుగా, చెవుల్ని బ్రద్దలు చేసేంతటి హోరుతో ముందుకు విరిగి పడిపోతున్నది. కాని ఎవరాపగలరు? ఆ జలభూతాన్ని

# ★ వెల్లువ ★

ఎదిరించగల శక్తి యెవరికున్నది? అంది సంతవరకూ అందరూమాత్రం ఆనందిస్తున్నారు అంతే.

ఊళ్లో జనం అంతా గట్టునే వున్నారు ఇస్త్రీమడతలన్నీ బయటికిరాసాగినై సిల్కు చీరలు, పువ్వులగుడ్డలు, అనేకరకాల సూట్లు, క్రొత్తరకాల ఫేషన్లు, అన్నీ వాటి యజమానుల దేహాల్ని అలంకరిస్తున్నై. అమ్మాయిలూ, అబ్బాయిలూ చక్కగా అలంకరించుకుని, నదీతటానికి విహారానికొచ్చి రాతిబండలమీద సుఖాసీనులై చల్లటి గాలిని పీలుస్తున్నారు - నిజానికి వీస్తున్నది ప్రచండమారుతమైనా ఇవన్నీ చూచుకుంటూ యింకా ముందుకు సాగిపోయాను రకరకాల మనుష్యులు, వింతవింత స్వరూపాలూ ఒక్కుమ్మడిగా నడిచిపోతుంటే ఓ పెద్ద ప్రాణి ప్రవాహంలా కనిపించింది ఎప్పుడూ చూడని ఆనందం, ఎప్పుడూ చూడని వికారం ఒకాయన అందర్నీ ఆపి— "అదుగో చూడండి మీకెవ్వరికీ నల్లికంపు కొట్టడంలా?" అన్నాడు "అఁ కొడుతున్నట్టే వుంది కొడితే?" అని కొట్టబోయినట్టే కొందరడిగారాయన్ని. "అవునా? ఇంకేవుందీ కొంప మునిగింది. నల్లికంపు కొట్టిందిరా— అంటే వరద యింకా ముంచుకొచ్చిందన్నమాటే -" అన్నాడు దాంతో కొందరు సంతోషించారు. మరికొందరు గండిపడుతుందేమోనని గాభరాపడ్డారు "గండి పడితే మరేమీ లేదు, మనమంతా సఫాయే" అని ఆ అనుభవజ్ఞుడనటంతోటే, గతుక్కుమన్న గుండెల్తో, పడబోయే గండిని తల్చుకుంటూ అందరూ తలో వేపూ జారిపోయేరు

నేను ముందుకు సాగిపోయేను. అక్కడ కొందరు యిసకబస్తాలు మోసుకొస్తున్నారు ఎందుకో నాకర్థం కాలేదు. ఎవరో ఒకాయన్నడిగాను ఆయన వినిపించుకోకుండానే కంట తడిపెట్టి, ఎవరికోసమో వెదుక్కుంటూ ముందు కెళ్ళిపోయాడు చివరికా మోసుకొచ్చే కూలీల్నే అడిగాను వాళ్లలో ఒకడు గట్టు కవతల క్రింది భాగం చూపించాడు. అక్కడ భూమిలోంచి నీరు పైకుబుకుతోంది అప్పుడే ఆ ప్రాంతంఅంతా మోకాలులోతు నీళ్లలో మునిగివుంది ఈ యిసక బస్తాలన్నీ ఆ 'ఊట' మీద వేస్తున్నారు ఓ యాభైమంది కష్టపడి, సుమారు అయిదొందల యిసకబస్తాలు ఆ 'జల' మీద పారేస్తేనే కాని అది తగ్గలేదు. అందరూ హడిలిపోతున్నారు చివరి కెల్లాగోలాగ ఒకమాదిరిగా నీరురావడం తగ్గింది కాని పూర్తిగా తగ్గిందని మాత్రం చెప్పడానికి వీల్లేదు

ఎప్పటికేం ముంచుకొస్తుందోనని చాలా మంది అక్కడే కాపలా కాశారు అక్కడికి సరిగ్గా ఓ ఫర్లాంగు ముందర రోడ్డంతా నీళ్లతో నిండిపోయింది అక్కడ రోడ్డు కొంచెం పల్లంఅవడం మూలాన, నీటిమట్టం హెచ్చిపోవడంమూలాన, రెండూ కలిసిపోయినై చూస్తుండగా మోకాళ్ళని కూడా దాటి అక్కడినీరు తొడలలోతు వచ్చేసింది ఆ నీళ్ళలోకి ఒక పడవని కూడా తీసుకొచ్చారు అదెక్కడాని కర్ధణా టిక్కట్టు అందులోయెక్కితే వంతెన మొదటి స్తంభందాకా తీసుకెళ్లి 'రీసింగు' చూపించి మళ్ళీ వెనక్కు తీసుకొస్తాడు

కుఱ్ఱాళ్ళని పట్టడాని కెవ్వరికీ ఖలేజాలేకపోయినై చేతుల్తోటీ, కాళ్ళతోటీ నీళ్ళని బాదడం, నీళ్లు చింది అవి అందరిమీదా పడటం, పెద్దవాళ్ళందరూ వాళ్ళని తిట్టడం - నవ్వు మొహాల్తో గలగలమని శబ్దాల్తో పేంటుమడతల నెత్తిపట్టి జోళ్లని చేత్తోపట్టుకుని నడుస్తున్న కుఱ్ఱాళ్ళూ, వాళ్ళముందో, వెనకాలో, పక్కనో చీరఅంచుల్ని మడిచి సగం సిగ్గుతో, కిలకిలమనే నవ్వుల్తో మందగమనంతో వస్తున్న ముదితలూ, నీళ్ళతో నిండిన ఆ రోడ్డుకి అలంకారప్రాయులయ్యారు.

ఇదిలా వుండగా అక్కడున్న యిళ్లుగలవాళ్ళందరికీ అదో పెద్ద సమస్యగా పరిణమించింది ఇళ్ళలోకప్పుడే మోకాలులోతు నీరురావడం, వాళ్లు సామాన్లు పైకి సర్దుకోవడం, నీరుయింకా పైకెక్కుతూండడం, ఇంకేం చేయాలో అర్థంకానప్పుడు వాళ్ల మొహాలు వెలవెల బోతూండడం, అది చూస్తూ, యేదో సహాయం చేద్దామనుకున్న మాకు - 'ఏం చేస్తాం, ఏం చేయగలం?' అన్న ఆలోచన రావడంతోటే మేం వెనక్కి తగ్గుతూండడం అన్నీ ఒక్కసారిగా జరిగేయి ఏమైనప్పటికీ అదంతా దృశ్యాన్ని ఆనందించడంగా పరిణమించడం తప్పితే మేమింక చెయ్యగలిగిందేమీ లేకపోయింది

అప్పటికే రాత్రి యెనిమిదన్నర గంటలైంది కాని జనంమాత్రం తగ్గలేదు నేను నెమ్మదిగా యింటివైపు దారితీశాను. ప్రవాహ వేగం యింకా యెక్కువైంది నీటిమట్టంకూడా ఐదారంగుళాలు హెచ్చింది నిమిషనిమిషానికీ, గంట గంటకీ హెచ్చిపోతున్నది ఆవేగాన్ని చూడలేక కళ్ళు తిరిగిపోతున్నై. కొందరు అబలలు చూడలేక కళ్ళు మూసుకున్నారు కూడా నేనింటికొచ్చేదారిలో నాలుగైదు తాచుపాముల్ని చంపేరు. ఇంకెక్కడో మరోపాటొచ్చిందని అందరూ ఆవైపు పరుగెత్తేరు నేనూ పరుగెత్తేను. అసలు జరిగిన సంగతేమిటంటే - పొరపాటున ఓ కుఱ్ఱాడు చూసుకోకుండా రాయొహటి విసిరాడు అదివెళ్ళి దుంగలమధ్యనున్న తాచుపాముమీద పడింది. పడీపట్టంతోటే అది తోకమీద 'ఛర్' మని లేచి ఆకుఱ్ఱాడిమీద పగబట్టింది దాంతోటి అక్కడున్న వాళ్ళంతా తలోకఱ్ఱా తీసుకుని దాన్ని బాదేరు ఆ దెబ్బల్తో అది కాస్తా ప్రాణాలు విడిచింది ఓ బుద్ధిమంతుడు కఱ్ఱకొనతో దాన్ని నీళ్ళలోకి తోసేయగా అదివడిలో కొట్టుకు పోయింది. అదైనా సామాన్యమైన పాముకాదు ఆరడుగుల పొడుగు, పెద్దవెదురుబొంగంత లావూ వుండి గోధుమవన్నెతో మిలమిలలాడిపోతోంది

ఇవన్నీ చూసుకుంటూ యిల్లు చేరేసరికి రాత్రి తొమ్మిది గంటలైంది ఇంటికొచ్చినప్పటికీ నాకళ్ళు - నదీప్రవాహ వేగాన్ని, అందులో కొట్టుకుపోయే చెట్లనీ, కప్పల్తోసహా తేలిపోతున్న యిళ్ళనీ, దుంగల్లో దాక్కున్న పాముల్నీ వీటన్నిటినీ చూస్తున్న జనసమూహాన్నీ - మాత్రమే చూస్తున్నై నా ఆలోచనంతా నదిప్రక్కనే విహరిస్తోంది ఆ ఆలోచనల్లోనే మేనువాల్చేను ఇంతలో కొందరు యువకులు మెగాఫోన్లతో గట్టిగా అరుస్తున్నారు "మహాజనులారా! నదిమట్టం నిమిష నిమిషానికీ హెచ్చిపోతున్నది. ఇక్కడికి కొకమైలు దూరంలో గట్టు ఒణికిపోతున్నది అక్కడ గండిపడేలా వుంది. మీరంతా తగు జాగ్రత్తలో వుండడం మంచిది" ఇదంతా విని వీళ్ళకేదో మతిపోయిందనుకున్నాను వచ్చే యెన్నికల్లో ఓట్లు సంపాదించడానికి వేసిన 'ఎత్తు' అని నిశ్చయించుకుని ముసుగు మరికొంచెం గట్టిగా బిగదన్ని పడుకున్నాను ఏదో పడుకున్నానన్నమాటేకాని సరిగా నిద్రపట్టలేదు పట్టిన పదినిమిషాల్లోనూ ప్రవాహమూ, పాములూ - వాటికి సంబంధించిన కలలే వచ్చినై రాత్రి పన్నెండు గంటలైంది అప్పుడే కొద్దిగా పడుతున్న నిద్ర ఒక్క మెగాఫోన్ కేకతో విచ్ఛిన్నమైంది. "సోదరులారా! ఇక్కడికి కొకమైలు దూరంలో పెద్ద గండిపడింది. ఆ

ప్రాంతం అంతా సర్వనాశనం అయిపోయింది. మనమ్కూడా యేక్షణంలో వఱదొస్తుందో చెప్పలేం అందరూ మెలకువతో వుండండి" అని హుషారిచ్చి మెగాహోర్న్ అరుమకుంటూ ఆ యువకులు ముందుకు సాగిపోయేరు ఆ వార్తతో నా నిద్ర పటాపంచలైంది పెగ చొక్కా అయినా సరిగా వేసుకోకుండా మునిగిపోయిన ప్రాంతానికి బయల్దేరాను. బయల్దేరిన వాణ్ణి నేనొక్కణ్ణేకాదు అంతా అలే పరుగెత్తేరు

ఒలమయమైన ఆ ప్రదేశాన్ని వర్ణించాలీ

# ★ వెల్లువ ★

అంటే హృదయం అంటూ ఉన్నవాడికి చాలా కష్టం మానవ మాత్రుడెవడైనా ఆభీభత్స దృశ్యాన్ని కనీసం తల్చుకునేందుకూడా జంకుతాడు

సరిగ్గా మేం నీటిఅంచునగల నుంచున్నాం అక్కణ్ణుంచీ వున్న రోడ్డంతా పల్లమే ఎంతపల్లమో ఒక చిన్న ఉదాహరణ చెప్తే తెలుస్తుంది. ఇక్కడ మా కాలి వ్రేళ్ళని తాకుతున్న నీరు నూరుగజాల దూరంలో వున్నయింటి కప్పుమీద నుంచి ప్రవహిస్తోంది అంటే, అక్కడ సుమారు యిరవై అడుగులలోతు నీరుందన్నమాట. కొందరు నీటిలో యెలాగో కష్టపడి యీదుకుని రోడ్డు – అదే – ప్రస్తుతం ఒడ్డుమీదికొచ్చి పడుతున్నారు. పడ్డగండికి దగ్గరగానే పెద్ద కలపఅడితీ లుండడంవల్ల అక్కడి దుంగలుకూడా ఊళ్ళోకి కొట్టుకొచ్చినై. ఆ దుంగలు సామాన్యమైన దుంగలు కావు – పెద్దపెద్ద టేకుపలకలూ, టేకు ద్రామ్ములూను ఒకొక్క దుంగ ప్రవాహవేగంతో కొట్టుకొచ్చి యిళ్ళను 'ధనా' మని గుద్దుకునేవి. అసలే నీళ్ళలో తడిసిన యిళ్ళు యీ దుంగల ధాటికి తట్టుకోలేక వెంటనే పడిపోయేవి ఈ యిళ్ళను గుద్దినదుంగలకూ, పడిపోయిన గోడలకూ మధ్య యెందరో అమాయకులు పడి నలిగిపోయేవారు ఈ దుంగల్నీ, పడిపోతున్న గోడల్నీ, యిన్నింటినీ తప్పించుకుని ఒడ్డుకి చేరుకున్న కొందరు ఘట్టప్రాణంగలవాళ్ళు నీళ్ళలో వుండిపోయిన తమ బంధువులకోసం యేం చేయాలో తెలియక గోలచేస్తున్నారు అక్కడో కుఱ్ఱాడు యీదుకుంటూ ఒడ్డుకొచ్చి పడ్డాడు పడీపడ్డంతోటే 'అమ్మా, అమ్మా' అని నెత్తి బాదుకోవడం మొదలుపెట్టాడు, 'ఏమిటంటే' మాట్లాడడు నెత్తీ నోరూ బాదుకోవడం తప్పితే మాకేమీ చెప్పలేదు మళ్ళీ నీళ్ళల్లో కెడతానంటాడు మేమంతా గట్టిగా పట్టుకున్నాంకాని ఆపడానికి మాశక్యం కాకపోయింది అప్పుడు కొందరు పెద్దవాళ్ళు కొప్పడ్డారు 'వచ్చినవాడి వెలాగూవచ్చావ్ మళ్ళీ అందులోపడి చావటానికా' అని అప్పుడుపాపం గోలపెడుతూ చెప్పాడా కుర్రాడు – ఎందుకో రోడ్డుమీదికొచ్చారట, జనం అంతా పరుగెడుతున్నారట, ఏమిటో అని నిద్రకళ్ళతో చూస్తూ నుంచున్నారట, ఈలోపలప్పుడే వరద వచ్చేసరికి అయ్యో, అయ్యో అనుకుంటూ నిద్రపోతున్న ముసలి తల్లిని లేపుదాం అనుకొని లోపలికెళ్ళి ఆవిణ్ని లేపేసరికి యింట్లోకూడా నీరొచ్చేసిందట – ఇద్దరికీ యేం తోచక వెనకొల్నుంచి దొడ్డి తలుపు తీసుకుని చూసేసరికి అక్కడకూడా నీరు రావటం చూసి కొయ్యబారిపోయేరు – చూస్తూండగానే మొలలోతు, మరోక్షణంలో గుండెల్లోతు నీరు వచ్చేసిందట దాంతో ఆకుర్రాడాగకుండా, వాళ్ళమ్మ సంగతి కూడా చూడకుండా యీదుకుంటూ అతి ప్రయాసతో ఒడ్డు చేరుకున్నాడు. తీరా చేరుకున్నాక వాడికి అమ్మసంగతి జ్ఞాపకం వచ్చిందట గట్టుమీదికొచ్చి గోల పెడితే లాభం యేముంది? ఆ కుర్రాడు మా అందర్నీ బ్రతిమాలాడు తనతల్లి నెలాగైనా కాపాడమనీ, ఎన్నివేలైనా ధారపోస్తానని వాడు ధారపోస్తానన్న వేలకోసం కాదు కాని, ప్రస్తుతం ధారపోస్తున్న కన్నీళ్ళనిచూసి జాలికలిగి నా గుండెలు ద్రవించినై 'సరే చూద్దాం' రమ్మనన్నాను.

బయల్దేరేసరికి 'కొంప మునిగిందిరా' అంటూ చంద్రం యేడ్చుకుంటూ వచ్చి కాళ్ళముందు పడ్డాడు జరిగినసంగతేమిట్రా అంటే బుర్ర నేలకేసి బాదుకుంటాడే కాని అసలు సంగతి చెప్పడు. చివరకి పాపం – 'సీతా పాపా నీళ్ళలోవుండిపోయార్రా' అనిమాత్రం చెప్పగలిగేడు "ఏం భయం లేదు, తీసుకొద్దాం పద," అని ధైర్యము చెప్పి మోకాలులోతు ముందుకెళ్ళాం మా అదృష్టం కొద్దీ అప్పుడే అక్కడికి రెండు పడవలొచ్చినై ఒక పడవవాణ్ని అడిగితే యాభై రూపాయులు కావాలన్నాడు ఆ సమయంలో బేరం యేమిటని సరే రమ్మన్నాం. మాతోపాటు మరో నలుగుర్ని తీసుకెళ్ళాం.

ముందా కుర్రాడు వాళ్ళింటికెళ్ళి వాళ్ళమ్మని రక్షిద్దాం అంటాడు చంద్రం – అలాకాగు ముందు నా పెళ్ళాం బిడ్డల్ని రక్షించాలంటాడు వీళ్ళ తగువు నాకో పెద్ద సమస్యగా పరిణమించింది పడవింకా ముందుకు పోనిమ్మన్నాను దారిలోనే చంద్రం యిల్లుండడం మూలాన పడవక్కడాపు చేయించాం అదృష్టవశాత్తూ – పిల్లవాణ్ణి చంకలో పెట్టుకుని సీతకొనప్రాణాల్తో చూరు పట్టుకుని వేళ్ళాడుతోంది. చంద్రం మొహం చెప్పలేనంత గా వికసించింది. నెమ్మదిగా సీతనీ, పాపనీ పడవలో చేర్చాం. దాంతో ఆకుర్రాడికి ఆశా, ఆరాటమూ హెచ్చి పడవవాణ్ణి తొందర చేసేడు అక్కడికో పాతిక గజాల్లోనే కుర్రాడిల్లు మీదకొచ్చే దుంగల్ని తప్పించుకుంటూ వరద [illegible]రుగా – కోసుకుంటూ పడవ ముందుకెళ్లి పడవ కుర్రాడింటి డాబా పిట్టగోడ పక్కనాగింది పడవ మీదనుంచి వాళ్ళ డాబామీదకురికాడతను 'అమ్మా, అమ్మా' అని యెన్నో కేకలేశాడు. పాపం సమాధానం రాలేదు అక్కడే ఆకుఱ్ఱాడలా గొంతు బ్రద్దలయేలా అరుస్తున్నాడు ఆ డాబా అసలే పాతదవడం మూలాన పిట్టగోడలు నాని నీటిలో పడిపోయినై

ఏభై గజాల దూరంలో అతి వేగంతో కొట్టుకొస్తున్న పెద్ద చెట్టొకటి నాకళ్ళబడింది అది చూడ్డంతోటే నాగుండెలు 'ఝల్లు'మన్నై అది వచ్చి మా పడవని గుద్దుకుంటే మమ్మల్నిపలకరించే దిక్కు మరెవ్వరూ వుండరు. ఏమైతేఅయిందని కుఱ్ఱాణ్ణి చప్పున రమ్మన్నాను. పాపం గొంతు పగిలేలా అరుస్తున్న తన గోలలో నా కేకలు వినిపించలేదు చెట్టు భూతంలా కొట్టుకొస్తున్నది కంఠం చెలిపోయేలా అరిచాను ఆ అబ్బాయికూడా వాళ్ళమ్మకోసం అలానే అరుస్తున్నాడు. చెట్టు మరీ దగ్గిరకొచ్చేసింది, ఆఖరుసారిగా ఒక్క పెద్ద కేకేసి పడవని పక్కకి తప్పించేశాం. అంతే – ఒక్కక్షణంలో ఆ చెట్టు ఆ పాత డాబాను భయంకరంగా 'ఢీ'కొన్నది మేంఅంతా చూస్తూండగానే, మాకళ్ళయెదుటే 'ఫెళ్ళ, ఫెళా' మంటూ ఆ డాబా నీటిలోకి కూలిపోయింది మరుక్షణంలో మా కక్కడా డాబా కనుపించలేదు, దానిమీది కుఱ్ఱాడూ కనిపించలేదు, వాడి కేకలూ వినిపించలేదు కాని అక్కడి నీళ్ళు చేసిన 'గలగల' శబ్దం మాత్రం హృదయాన్ని చీల్చి ముక్కలుముక్కలుగా చేసింది ఆ భూతం ప్రవాహంతోపాటు ముందుకు పోయింది – యింకెన్ని కొంపల్ని కూల్చడానికో. ఏకుఱ్ఱాడితల్లినైతే కాపాడదామని పడవ మాట్లాడామో, చివరికా తల్లినీ – కనీసం ఆకుఱ్ఱాణ్ణీ – అయినా కాపాడలేకపోయాం కన్నీళ్ళతో కాళ్ళావేళ్ళాపడి, తన తల్లిని యెల్లాగైనా రక్షించమ[illegible] దీనవదనం! నా స్మృతి[illegible] అప్రయత్నంగా నా [illegible] కన్నీటిధారలు కురిసినై [illegible] మా కళ్ళయెదుటే గంగ[illegible] కలిసిపోయేడు

చేసేది లేక మేం వెనక్కు తిరిగాం [illegible] అప్పటికే రాత్రి [illegible]

(54-వ పేజీ చూడండి)



# కాసుకి దాసులు

ఎక్కడా పనిపుట్టక, వేరే గతిలేని వాళ్ళచేతనే, వీలయినంత తక్కువ జీతానికి పనిచేయించుకునే వెంకయ్యాకీ, అక్కడో కొంతపని యిక్కడో కొంతపని చేసి, ఏదో నాలుగు రాళ్ళు సంపాదించుకొందామని చూచే అప్పికీ — సేవ్యసేవక సంబంధం చక్కగా అమరింది రేషన్ డిపో పెట్టి వెంకయ్య పాతికవేల దాకా కళ్ళజూశాడంటారు దానిమీద ఒక వేపున వడ్డీ వ్యాపారం (లోపాయికారిని మాత్రమే వడ్డీ ఎంతో లేదు - నెలకి నూటికి పన్నెండున్నర అధికం పుచ్చుకోడు), ఇంకోవేపు కిరాణాకొట్టు, మరోవేపు వేరుశెనక్కాయలు, మిరపకాయలు, పొగాకు ఇత్యాది వ్యాపారం — ఇదీ అదీ యేమిటి? పట్టం జిల్లా బంగారంగా యిప్పుడు లక్షలు గడించాడు ఋణం తీర్చలేని వారిని దయతలచి, యేరవ్యారట్టూ లేకుండా ఏదో వాళ్ళు చూపించిన పొలం పుట్రా, యిలు పొల్లూ, గొడ్డూ గోదా వగయిరా యేదయినాసరే స్వీకరించి — వాళ్ళను ఋణ విముక్తుల్ని చేస్తూ వుంటాడు.

వెంకయ్యకు యింకో సుగుణం వుంది ఎవరైనా ఓ యేభై రూపాయలు అప్పు కోరరంటే — వారికి ఆ మొత్తమంతా ఒక్కమారే యిచ్చెయ్యడు ఒక్కమారే యిచ్చేస్తే వాళ్ళు దుబరాగా ఖర్చుపెట్టి డబ్బు ఆ వెంటనే పాడు చేస్తారు డబ్బు విలువ వాళ్ళకేం తెలుస్తుంది? తిరిగీ తన కాకలమీదకే సవారీ, మళ్లీ అప్పుపెట్టమని అంచేత, అప్పుడు పది, అప్పుడు అయిగు అప్పుడో సేరు బియ్యం, అప్పుడో కానీ చింతపండు. యిలాగు ముట్టజెప్పుతూ, ఆ యేభైరూపాయలూ పూర్తి అయాక నోటు రాయించుకుంటూ, వాళ్ళ సంసారాలు నిలబెడుతూ వస్తున్నాడు అప్పు ఆ కాతాలో అప్పుడప్పుడు పది యిచ్చిన వాడికి పరాకున యిర్వైపడుతూ వుంటుంది. పాపం, యిన్ని వ్యాపారాలలో హైరాన పడుతూవుంటే ప్రాణికి ఎంతకని జ్ఞాపకశక్తి వుంటుంది!

ఇంక అప్పి సంగతి — ఆస్పత్రిలో పని మనిషిగా నెలకు ఆరురూపాయలు ముడుతున్నాయి ఆమీద ఒకరింట్లో పాచిపనివగైరా చేసినందుకు నాలుగు రూపాయలు, ఇంకొకరింట్లో అంట్లుతోమినందుకు మూడురూపాయలు, విశాలాక్షమ్మగారి చంటిపిల్లాడికి ఉగ్గు పోస్తున్నందుకు గాను రెండు రూపాయలు సంపాదిస్తుంటుంది యింట్లో పిల్లా పిచ్చికా బలగం జాస్తి అయిదు మేకలు, నాలుగుఆవులు పెంచుతోంది సేరుపాలలో చాలా తక్కువగా రెండు సేర్లు మాత్రమే నీళ్లు కలిపి అమ్ముతుంది ఆ అయ్యనీ, యీ బాబునీ అడిగి చుట్ట ముక్కలూ — ఆ అమ్మనీ, యీ తల్లినీ అడిగి యింత కూరాపచ్చడీ సంపాదించుకుంటుంది ఇంతమందికి యిన్నిపనులు చెయ్యాలంటే మాటలా? తాను కాబట్టి వాళ్లమీద అభిమా

శ్రీ అరసాడ పద్మారావు

నించి, ఏదో ఆమాత్రం సహాయం చేస్తూ వుంటుంది తప్ప — యింకెవరు చెయ్యగలరు అంత తక్కువ జీతంలో? అంచేత అక్కడో కొంతపనీ, యిక్కడో సగం పనీ చేసి — తన యజమానులందరికీ న్యాయమైన సంతోషం కలిగిస్తుంటుంది అప్పిదికూడా మానవజన్మే కదా — అప్పుడప్పుడు తలనొప్పో, జ్వరమో వస్తుంటుంది దగ్గర బంధువులెవరో కాలం చేస్తూవుంటారు. మరి, యిలాంటి సమయాల్లో నాగాలు పెట్టకపోతే యెల్లా చస్తుంది?

వెంకయ్య యింట్లో ఒక పది రోజులు పనిచేసిన మనిషి నెల యెప్పుడౌవుతుందా అని చూస్తుంది అప్పుడే ఎందరో మారారు. ఇది మంచికి కాలం కాదంటాడు వెంకయ్య. "యింత గంజీ అన్నం వంటబట్టే సరికి ప్రపంచమే కనబడకుండా పోతుంది" అంటూ పనివాళ్ళ కృతఘ్నత గురించి ఉపన్యాస మిస్తుంటాడు, అవసరం వుండి తన వద్దకు వచ్చిన వారితో. ప్రస్తుతం జీతానికి కుదిరిన వారు యెవరూ లేరు. ఏ పూట కూలీ ఆపూట యేదో విధంగా ముట్టచెబుతూ అందాకలా యెవరిచేతనో పని చేయించుకుంటున్నాడు ఏ గతిమాలినదైనా రాకపోతుందా అని చూస్తున్నాడు

అప్పికి తన సంపాదన యింకా చాలడం లేదు ఇంకెవరైనా పిలుస్తారేమో అని చూస్తోంది వెంకయ్య పనిమనిషి కోసం చూస్తున్నాడని తెలిసింది గాని, తానై అడగ కూడదని నిశ్చయించింది చింతపండుకనో, మిరపకాయలకనో వంకపెట్టి రోజుకు మూడు నాలుగు మార్లు ఆ యింటి వేపు వెళుతోంది

ఒక రోజున వెంకయ్య అప్పిని పిలిచి అన్నాడు — "పనిమనిషి కోసం చూస్తున్నానే" — అని

"జీతమెంత యిస్తారు బాబూ" అంది అప్పి

"అర్ధరూపాయి జీతమున్నూ, మధ్యాన్నం పూట అన్నమున్నూ".

"కష్టం తీరదు బాబూ — అన్నం మానేసి ఆరురూపాయలిప్పించండి"

"మేమేం రూపాయల చెట్టు పండించలేదే"

గుమ్మం దిగిపోయింది అప్పి

మూడు రోజులు పోయాక దారిని పోతున్న అప్పిని పిలిచి "యెవరైనా మనిషి కుదిరారే" అని అడిగాడు వెంకయ్య

"యెవరున్నారు బాబూ, నేనే వస్తాను. మరి మీరు అంత డబ్బు యివ్వలేమంటున్నారు" అంది అప్పి.

"అయిదు రూపాయలకంటె యెక్కువ ఒక్క దమ్మిడీ ఇవ్వలేను. యిష్టముంటే చెయ్యవచ్చు, లేకపోతే మానీవచ్చు" —

అప్పి ఒప్పుకుంది ముందు చెప్పవలసిన పంచాంగమంతా చెప్పి ఒకటో తారీఖు నుండి పనిలోకి రమ్మన్నాడు.

ఈ విధంగా ఈ యిద్దరు విచిత్ర వ్యక్తులూ తటస్థపడ్డారు.

* * *

ఒక నెల గడిచింది మొదటి నెలలోనే అప్పి అప్పుడే అయిదు నాగాలు పెట్టింది. అనుకున్న వేళ తప్పించి రావడం, యజమానురాలు కేకలెయ్యడం, అప్పి

అడ్డంగా దబాయించడం జరిగింది వెంకయ్యగారి పనిమనిషి కొత్తాలో అయిదు రోజుల నాగా పద్దు పడింది. నెలగడిచి రెండు మూడు రోజులయాక—వెంకయ్య యింతకీ పిలిచి తన జీతం యివ్వక పోవడం చూచి—అప్పి తనే అడిగింది.

"నీకు ఆ రూపాయలు యిచ్చేస్తే మామూలు ఖర్చులో పడిపోతుందేగాని, యేమైనా లాభంవుందా? మనకు యిబ్బంది లెప్పుడుండవు? నావద్ద ఒక సంవత్సరం వరకూ నీ జీతం దాచుకున్నావంటే— అప్పుడేదో సరుకో, సెబ్బరో చేయించుకోవచ్చు, లేదా పెద్ద అవసరమేదైనా గడుపుకోవచ్చు — ఏమంటావు?" అని యెంతో అభిమానం చూపుతూ అన్నాడు వెంకయ్య

అప్పి కొంతసేపు ఆలోచించింది— "మీ దయ అలాగే కానివ్వండి బాబూ!- కాని, చిన్న కాయితం ముక్కమీద ఆ సంగతి రాయించి యివ్వండి"

"నేను అంత దగాకోరునా" అంటూ కోపం తెచ్చుకున్నాడు వెంకయ్య

"ఎంతమాట! నేను అలా అనగలనా?- ఎందుకైనా మంచిదని . .." - అన్నది అప్పి.

"అయితే యిదిగో నీ జీతం!" - అంటూ అవమానం భరించలేనివాడికి మల్లే, వెంటనే రూపాయలు తీసి పారేసేందుకుగాను చెయ్యి పోనిచ్చాడు.

"తమ దయ"-అని చెయ్యి చాపింది అప్పి.

అప్పి అందరిలాగా లొంగే ఘటం కాదని తెలుసుకున్నాడు. ఒక నిమిషం ఆలోచించాడు "పోనీలేవే, అలాగే వ్రాసియిస్తాలే. ఏదో నీ స్థితి బాగు చేద్దామని నా వుద్దేశంగాని, నాకు నీ సొమ్ము కావాలా? నువ్వు వేరే ఉద్దేశంలో పడ్డావుగాని" అన్నాడు.

"ముష్టి అరవై రూపాయలనగా మీ కెంత బాబూ?. ఎందుకయినా మంచిదని అలా ప్రాధేయపడుతున్నాను" అన్నది అప్పి

వెంకయ్య వ్రాసియిచ్చాడు

* * *

ఒకమారు అప్పి రెండో కూతురు సిమ్మాద్రికి సంబంధం మాట్లాడుకోడానికి చుట్టాలు వచ్చారు. వచ్చినవాళ్లు ఒకరూ, యిద్దరూ కాదు అయిదుగురు! వాళ్లకి యింత పప్పు కూడు వండి పడెయ్యాలి అప్పికి చేతిలో పైసా ఆడడంలేదు అక్కడా అక్కడా అడిగిచూచింది కానీ చేబదులు పుట్టలేదు చివరికి వెంకయ్య దగ్గరకే వెళ్లింది ఆ సమయంలో పాలిక ముప్పయిమంది రైతులతో మాట్లాడుతున్నాడు వెంకయ్య వాళ్లు వెళ్లాక అడగొచ్చని కొంతసేపు వూరుకుంది అప్పి. ఎప్పటికీ వాళ్ళు కదిలేజాడ కనిపించలేదు. అడగడమూ, మానడమూ అని తటపటాయించి, యిప్పుడు కాదు—మళ్ళీ వద్దామని మనసు మార్చుకొంది. అయితే అవతల వంటమాటో? ఇంకెవరిని అడుగుదామా అని ఆలోచించింది చేబదులు యిచ్చేవారెవరూ కనిపించలేదు ఇక వడ్డీకే అడుగుదామని నిశ్చయించింది. వెంకటాచారి ఆమెకు జ్ఞాపకం వచ్చాడు. వెళ్ళి, పదిరూపాయలు అప్పుపెట్టమని అడిగింది. అతను లేదులేదని కొంతసేపు మురిపించి - యెవరికో అంతకుముందు యిస్తానన్న బాపతు ఒక అయిదు రూపాయలు వున్నాయంటూ.. వారానికి రూపాయికి అణా వడ్డీతో ఒక్క వారంలోనే తీర్చాలని ఖరారు చేసి మరీ యిచ్చాడు అప్పటికి అదే మహాద్భాగ్యంగా యెంచి అప్పి ఆ డబ్బుతో ఆపూటకు కావలసిన సామగ్రి అంతా తెచ్చి యింట్లో పడేసింది యీ సందర్భంలోనే వెంకయ్యవద్ద డబ్బు తెస్తేనేగాని, వారంనాటికి వెంకటాచారి బాకీ తీర్చడం పడదని ఆలోచించి, వెంటనే వెంకయ్య యింటికి వెళ్లింది

సాయంకాలం ఆరుగంటలయింది. తాను అప్పులు పెట్టిన ఉపకారానికి గాను వెంకయ్య రైతులచేత కూలి యివ్వనవసరం లేకుండా, వంట చెరుకుకోసం ఎండు చింతమాను కొట్టిస్తున్నాడు. చంకలో పిల్లాణ్ణి ఎత్తుకొని తిప్పుతూ, అప్పుడే పొలంనుంచి వస్తూన్న ఆవులను పాలేరుచేత సాలలో కట్టించి, కుడితి పెట్టమని చెప్పాడు పాలేరు తన పనిలో వున్నాడు. ఆ సమయంలో అప్పి వచ్చి అక్కడ నిలబడింది

అప్పిని చూడగానే వెంకయ్య "ఇంట్లోకి పోయి పాలదుత్త తీసుకరావే అప్పీ!" అన్నాడు. అప్పి చేతులు నులుముకుంటూ "తీసుకవస్తాను గానండీ యివాళ చిన్న అవసరం పడిందండి!" అని నసుగుతూ అన్నది. అతడి ముఖం జేవురించి, తత్కాల సంధ్యారుణరాగదీప్తి వహించింది.

"ఏమి అవసరమే? అదేదో నా దుంప తెంచే అవసరమే నన్ను చూస్తే సరి, అవసరాలు పుటుకొస్తాయి అందరికిన్నీ"— అంటూ చిందులు తొక్కడం మొదలెట్టాడు. రైతుల చేతుల్లోని గొడ్డళ్ళు ఒక్కమారే ఆగిపోయాయి. క్షణకాలంపాటు వాళ్ళు శిలాప్రతిమ లయిపోయారు పిదప నవ్వుకుంటూ తమ పనిలో లీనమయారు

"యెప్పుడైనా మిమ్మల్ని యిబ్బంది పెట్టానా బాబూ! యివాళ పిల్లదాన్ని చూడడానికి చుట్టాలు వచ్చారు మర్యాద

ఒకతార:- ఏయ్ లక్ష్మి. డైరెక్టర్ ఎల్లయ్య చనిపోయాడట. ఆయనింటికి పరామర్శించటానికి వెళ్లొస్తాను... నా హేండ్ బేగ్ ఏదీ?... ఇలా తీసుకురా.

దాసీది:- హేండ్ బేగ్‌లో గ్లిసరిన్ బాటిల్ కూడా పెట్టివ్వమన్నారాండీ?

శ్రీ జి. వి. జి. కృష్ణ, మద్రాసు

పోతుందిగదా అని మీ కాళ్లు పట్టుకోడానికి వచ్చాను" అని ప్రాధేయపడి అడిగింది అప్పి

కొంచెం తగ్గాడు వెంకయ్య "అన్నా, చంపేశావే ఒక గంటకింద అడిగివుంటే ఏదో కొంత సర్దేవాణ్ణిసుమీ యిప్పుడు నౌకరు లేదంటే నమ్మ" అన్నాడు ఎంతో సానుభూతి చూపిస్తూ

"అలా అంటే ఏం చెయ్యగలను చెప్పండి అవతల చుట్టాలదగ్గర పరువు పోతుంది ఎలాగో ఓలాగు చూద్దురు బాబూ!" అంది అప్పి

"గాయత్రి సాక్షి ఒట్టు వేసుకుంటానా? యిప్పుడు నాదగ్గరం లేదు ఇంకెవరినన్నా అరగుదూ తరువాత చూసుకుందాం" అన్నాడు

"అంతా నిరాశ చేసుకున్నాకే మీకాడికి వచ్చానండి మీరెలాగైనా కటాక్షించక తప్పదు"

"లేదని చెబుతున్నానుగా మరి చంపకన్నా, రేపు పదిగంటలకు చూస్తాలే"

అప్పి కొంత ధైర్యపడింది "చిత్తం అలాగే గ్గానండి యిప్పుడు యింట్లో పిడికెడు గింజలన్నా లేవు దయుంచి నాలుగు సేర్లు బియ్యమన్నా యిప్పించండి" అని అడిగింది

"సమయంకాని సమయంలో అడిగితే ఎల్లా చెప్పా పోనీ యింట్లో అడిగి ఇస్తానుండు"

వెంకయ్య యింట్లోకి పోయాడు ఇంతకీ రాలేదు, అంతకీరాలేదు చూచిన కళ్ళు కాయలు కాచిపోతున్నాయి అప్పికి అప్పుడే మసక చీకటిపడింది పాలేరు యింట్లోంచి దుత్త తెచ్చి, పాలు పితికి పోయాడు రైతులు చెక్కపేళ్లు అటకమీదపడేసి యిళ్ళకు పోయారు ఒక అరగంటవరకూ చూసి అప్పి మరి ఓర్చుకోలేక గట్టిగా కేకేసింది ఆయన యింతలో తలుపుతీసుకొని వచ్చి "యేలాగ, యిప్పుడే రొసట్లో పోశారట! యేం చెయ్యను? అందాకలా కావలస్తే - రెండు సేర్లున్నాయి ఏదో అవసరం గడుపుకో" అన్నాడు విచారం వెలిబుచ్చుతూ.

అప్పికి నోళ్ళు మండుకొచ్చింది. అయినా తమాయించుకొని, "మరేంచేస్తాం అలాగే యిప్పించండి" అంది ఇది యెంతకీ వొదిలే ఘటం కాదనుకొని, వెంకయ్య యింట్లోకి పోయి చేటలో బియ్యంపోసి తెచ్చాడు

మర్నాడు వుదయం పాచిపనీ, అంట్లు తోమడం వగయిరాపనులు పూర్తి అయాక అప్పి వెంకయ్యని పలుకరించింది సాయంత్రం కనిపించమన్నాడు. మధ్యాహ్నం అంట్లు తోమడానికి వచ్చి మళ్ళీ అడిగింది వెంకయ్య చర్రున లేచాడు.

"యేం తొందరవచ్చిందే? సాయంత్రం కనిపించమన్నానుగా?"

"మజ్జానం గడవడమే కష్టమయిందండి సాయంత్రమయాక మీరిస్తే నేనెప్పుడు అన్నీ సిద్ధంచేసుకునేది?"

"ఓ బాధలేదు అయిదు గంటలకు కనిపించు"

సాయంత్రం వచ్చింది అప్పి చావడి నిండా రైతులే వెంకయ్యా ఆ రైతులూ గొంతులు చించుకుంటున్నారు వ్యవహారం చాల రద్దీలోవుంది అప్పి అలాగే ఒక ప్రక్క నిలబడివుంది వెంకయ్య ఆమెను చూచీ చూడనట్టు తన వ్యవహారంలో నిమగ్నుడయాడు

ఇంతలో పోగాకు యినస్పెక్టరు తాలూకు ప్యూను సైకిలుమీదనుంచి దిగి, వచ్చాడు. "ఏమోయ్ రంగదాసూ" అని పలుకరించాడు వెంకయ్య అంత రద్దీలోనుంచి కూడా. వెంకయ్యకు పొగాకు వ్యా

# ★ కాసుకిదాసులు ★

పోరంకూడా వుంది ఆ వుద్యోగుల్ని మంచి చేసుకోకపోతే యెలాగ?

"వెంకయ్యగారూ, మీతో కొంచెం మాట్లాడవలసిన పనుందండీ!" అన్నాడు జవాను వెంటనే వెంకయ్య లేచి అతణ్ణి గదిలోకి తీసుకు వెళ్ళాడు కొంతసేపు అయిన తరువాత జవానుమాత్రం బయటికివచ్చాడు. మరి కొద్ది నిముషాలలోనే వెంకయ్య కూడా చొక్కా, కండువా వేసికొని, యేవో పుస్తకాలు పట్టుకొని వచ్చాడు యిద్దరూ కలిసి యెటో బయలుదేరారు.

అక్కడ చేరినవారు అప్పలాగే ఏమేమి పనుల నిమిత్తం వచ్చారో అంతా నిర్ఘాంతపోయారు. అందరికీ ఒక్కసారే నిట్టూర్పులు వచ్చాయి. ఎఱ్ఱబారిన వారి కంటి పాపలలో వెంకయ్యని మింగేద్దామా అన్నంత కోపం కనిపిస్తోంది. ఆ నిస్పృహ ఒకరి కష్టసుఖాలు ఇంకొకరితో చెప్పుకుపోతున్నారు చివరికి—ఎంత ఆలస్యమయినప్పటికీ యివాళ యిక్కడనుంచి పనులు అవందే యెవరూ కదలకూడదని నిశ్చయించుకున్నారు

అతి దీర్ఘమైన అరవై నిముషాల అనంతరం మాడిపోయిన మొహంతో తిరిగి వచ్చాడు వెంకయ్య అవతల ఆ ఆఫీసరు ఏమి అఘాయిత్యం చేశాడో, ఆ దుఃఖంతో యింటికి వచ్చి వీళ్లందరినీ చూసేసరికి వెంకయ్య మొహంలో చిరాకు వ్యక్తమయింది మాట్లాడకుండా యింట్లోకి పోయి తలుపేసుకున్నాడు ఇంతకూ రాలేదు, అంతకూ రాలేదు

"యివాళేదో కొంచెం చేతి చమురు రాలిందిలా వుందిరోయ్. ఏదోమాదిరిగా వున్నాడు" అని కొంతమంది; "మంచిపనే అయిందిరా కౌకుల్ని కొట్టి గద్దలకు వేస్తుంటాడు" అని మరి కొంతమంది, "యిప్పుడసలే మాట్లాడడు గావాల్రోయ్" అని యింకొందరూ అభిప్రాయాలు వెలిబుచ్చుతున్నారు. అడగడమా, మానడమా అని ఆలోచిస్తున్నారు.

సాహసించి యిద్దరు ముగ్గురు రైతులు వెంకయ్యని కేకపెట్టారు వెంకయ్య రాలేదు. ఉండుండి ఒక్కొక్కరే తలుపుతుద్ది పిలవడం మొదలెట్టారు కొంతసేపటికి విసురుగా తలుపుతీసుకుంటూ అతను వచ్చి "ఏమిటయ్యా, మీ గోలేమీది గాని, యివతల మేమెల్లా చస్తున్నామో చూడక్కర్లేదూ?" అంటూ రైతులమీద కస్సుమన్నాడు.

"మాకు మాత్రం తెలీదేంటండీ? అన్నం తింటున్నామా, గడ్డి తింటున్నామా? మాకు వుండుకున్న యిబ్బందులకొద్దీ" - అని కొంతమంది ప్రాధేయపడుతూ అన్నారు

"యివతల మాగోల యెవడు చూస్తాడయ్యా" అంటూ కొందరు విసురుగానే అడిగారు

వెంకయ్య కొంచెం తగ్గి "యిప్పుడేవున్నదేదో ఆ కాస్తా వాళ్ళ యెదాన కొట్టేడికాను మరి చిల్లిగవ్వలేదు" అన్నాడు.

"అవునయ్యా! పాపం, నీదగ్గర యెప్పుడూ చిల్లిగవ్వ ఉండదు. నోట్లూ, రూపాయిలే వుంటాయి యీ వేషాలు కట్టిపెట్టి నాకు రావలసిందేదో సజావుగా పారెయ్!" - అంటూ విసిగి వేసారిన ఒక రైతు ఖచ్చితంగా అడిగాడు. వెంకయ్యని అంత మాటనడం కొందరు సహించలేకపోయారు ఆ మహారాజు ధర్మాన ఏదో యింత బ్రతికి బట్ట కట్టు గలుగుతున్నారు! అందులో ఒకాయన

"ఓస్, ఏట్రా? నువ్వే మొనగాడివి! నీపాటి మోసం ఆరికిలేకపోతే పెద్దా చిన్నా గానం వుండొద్దూ" - అంటూ అవతలి ఆసామీని ఎదురుకున్నాడు.

"అవున్రా యిచ్చకం దాసులూ!. మోసం వుండట మోసం! తెగబారెడు! - ఆ మాత్రం అభిమానం వున్నవాడు అప్పుడే యిచ్చిరాదూ?" అంటూ ఆ మొదటి రైతు ఉల్లసమాడాడు

దీంతో వెంకయ్యకీ, వెంకయ్య తరపు రైతుకీ ఉక్రోషం వచ్చింది. ముగ్గురూ గట్టిగా మాటలు మిగుల్చుకుంటున్నారు. అంతకంతకీ తగవు పెద్దదయింది మొదటి రైతు రౌద్రాకారుడై వెంకయ్యమీది కొస్తున్నాడు తక్కినవాళ్లంతా అతణ్ణి అడ్డుకొని, శాంతింపజేస్తున్నారు

ఇంక అల్లరికిపడి లాభం లేదనుకున్నాడో యేమో వెంకయ్య యింట్లోకి వెళ్ళి గబగబా యేభైఅయిదు రూపాయల యెనిమిది అణాలు తెచ్చి, ఆ రైతు నుద్దేశించి "యిదుగో నోయ్ నీడబ్బు అందాకలా యిది తీసికెళ్ళు తతిమ్మా నలభైనాలుగున్నరా వచ్చేవారంలో యిచ్చేస్తాను. సొమ్మంతా వొక్కసారే యిస్తే నీ అవసరం యేదైనా గడుస్తుంది కదా అని ఆలోస్తూ వుంటే. నీకదేం పట్టలేదు" అంటూ చేతికిచ్చాడు.

"అదిగో, నీ గుణం పోనిచ్చావు కాదే పాపం, చిల్లిగవ్వ లేదుకదూ! తక్కింది కూడా యిలాగే పెసది రూపాయల మాటో?" అని తిరిగి అడిగాడా రైతు

"మా పాపుకార్లం యెలా బతకడం చెప్పు? నువ్వంతగా కాదు కూడదంటే మరో అయిదు వేసి నలభైతొమ్మిదిన్నరా యిచ్చేస్తాలే"

"అర్ధరూపాయిలో నీ ముల్లెం పోదులే ఆ యేభై యిటు తే"—

"నా మాటనమ్మ మరిలేదు అణాలతో సహా వున్నదంతా వూడ్చి తెచ్చి కిచ్చాను"

"సరే, వొచ్చేవారం చూద్దాం కదూ!" అంటూ ఆ రైతు డబ్బు మూటకట్టుకొని పోయాడు అప్పుడు రమారమి యేడు, యేడున్నర అవుతుంది యింత వేళవరకూ తక్కిన రైతులూ, అక్కడ అలాగే కనిపెట్టుకొనివుంటూ, యీ రంధి పూర్తయాక అప్పుడు తమ గోడు వెళ్ళబుచ్చారు "నన్ను కొరుక్కు తినండిగాని నావద్ద యిప్పుడేం లేద"నీ, "శేపేదో చూద్దామ"నీ - చెప్పి వెంకయ్య కళ్ళు తేలవేశాడు కొంతసేపు రాద్ధాంత సిద్ధాంతాలు జరిగాక - అందాకలా ఆపూట మనిషికి రెండేసి సేర్ల బియ్యం, చింతపండు, మిరపకాయలు, నూనె, కిరసనాయిలు వగయిరా యివ్వడానికి ఒప్పుకున్నాడు

వెంకయ్య ఉద్దేశం అప్పి బాగా తెలుసుకుంది మరి అక్కడ ఉండకుండా గిరున తిరిగి యింటికివచ్చేసింది "కూలి దాని కెంత బాకరో చూశారా?" అన్నాడు వెంకయ్య అక్కడున్న వాళ్ళతో.

"అబ్బో, అప్పి సంగతెవరికి తెలీదు?" అంటూ వ్యాఖ్యానించారు వాళ్లంతా.

* * *

ఇంకో మారు యిలాగే మరో పెద్ద

అవసరం కలిగింది అప్పికి సంకురాత్రి పండక్కి పెద్ద కూతుర్నీ అల్లుణ్ణీ తీసుకొచ్చింది పదిరోజులు ముందుగానే ఆ అల్లుడు పెళ్లాం మీద యెందుకో కోపగించి, పండుగు మూడురోజు లుండనగానే వెళ్లిపోయాడు పాపం అప్పికి గట్టి చిక్కు వచ్చింది కోపం మళ్లించుకొని తిరిగి రాకపోతాడా - అని చూసింది ఎప్పటికీ రాకపోవడం చూసి, యిక లాభం లేదని, అతణ్ణి బోధపరచి తీసుకువద్దామని అల్లుడింటికి పయనమయింది అతను ఎక్కడో మిల్లు పనికి పోయాడనీ, యింకో పిల్లకోసం చూస్తున్నాడనీ తెలియ వచ్చింది అల్లుడు ఎంతటి అంతకొనికి ఒడికట్టాడని బెంగటిల్లిపోయి, యింటికి తిరిగి వచ్చింది. కుల పెద్దలతో ఆలోచించింది "వాడి నీలగడమేమిటో చూద్దాం. ఆ వూరి పెద్దల దగ్గరే తగువు పెడదాంపద" అని సలహాయిచ్చారు వాళ్ళు. సుమారు పదిమంది వున్నారీ పెద్దలు. ఇక్కడి నుంచి బయలు దేరింది మొదలు, తిరిగి తీసుకొని వచ్చేదాకా అయే ప్రయాణం ఖర్చులూ, ఖుషీ ఖర్చులూ వగయిరా అన్ని ఖర్చులూ అప్పి భరించవలసివుంది. సుమారు పాతిక రూపాయలుండాలి ఏం చేస్తుంది? తాను అప్పులిచ్చిన వాళ్లు సమయానికి సర్దే స్థితిలో లేరు.

మరొక్కమారు వెంకయ్యని సంప్రతించి చూద్దామనుకుంది. అప్పి యీ వృత్తాంతమంతా వెంకయ్యతో చెప్పి-యీ సందర్భంలో యీమారైనా పాతికవరకూ సరకొయించాలని దీనంగాఅడిగింది అతను తన రెప్పటి పాటే లంకించుకున్నాడు అప్పుడే తనకు పదిమాసాల జీతం రావలసివుందనీ, అదైనా యిస్తే తన అవసరం గడుస్తుందనీ అప్పి మళ్లీ అడిగింది వెంకయ్య తాపీగా యిలా అన్నాడు.

"యిప్పుడీ డబ్బిచ్చేస్తే—అది యీతిండి పోతు రాయిళ్ల కింద కరిగిపోతుందే గాని, పిసరంతైనా లాభం వుందా? కొంచెం కష్టపడి నిగ్రహించావంటే నీ అరవై రూపాయలూ ఒక్కమారే యిచ్చేస్తాను ఏదైనా పెద్ద అవసరం గడుస్తుంది అన్నట్లు నీ కూతురు పెళ్లొకటి వస్తుందిగా?"—

"ఆ కూతురు పెళ్ళికంటె ముందు యీ కూతురు తద్దినం ముఖ్యం. తరవాత మారెక్కల కష్టమే వుంది,—మీవంటి దొరలే వున్నారు యిప్పుడీ అవసరం గడపండి"-

"ఇలా అంటున్నానని మరోలా అనుకోకు. నీ మంచి కోసమే అడుగుతూంట. నీ కొచ్చిన జీతాలూ, నాతాలూ యేం చేస్తున్నావు?",

అప్పికి ఒక్కమారే నఖశిఖపర్యంతం మంటపుట్టింది "మే మెల్లాగో బస్తున్నాం. నా డబ్బు నాకిచ్చెయ్యమంటే ఈమాటలు దేనికి? ఇదే అంటారు పిల్లికి చెర్లాట, ఎలకకి ప్రాణపోకడ అని"

"నువ్వు రీజన్లూ, పద్ధతులూ నేర్చుకున్నావే అప్పీ. యిప్పుడు మీతో మాటాడమే కష్టం నీ మంచికోసమే చెబుతున్నాను గాని, నాకేం కావాలి? సాయంత్రం కనబడు!"

సాయంత్రం గడిచింది, రేపు ఉదయం గడిచింది మరొక సాయంత్రం, మరొక రేపు గతించాయి యిల్లా రేపులు, మాపులు గడవడమే గాని వెంకయ్య చేతిలో నుంచి అప్పి చేతిలో ఒక ఎర్రని ఏగాని అయినా పడలేదు "మాకు మరి పనులు లేవా? వేగం వెళ్ళి వద్దాం ప్రయాణం చేయించు" అంటూ ఒక వేపు కులపెద్దలు తొందర పెడుతున్నారు తిప్పి తిప్పి, షావుకారు తుదకి తొంట చెయ్యి చూపించాడు చేసేది లేక తన ముక్కుపి, చెవిలోనివి వెంకటాచారివద్ద తాకట్టు పెట్టి బయలుదేరింది అప్పి

గొలాగయితే నేం ముప్ఫై రూపాయల ముడుపుతో కార్యం సానుకూలమయింది పట్నం నుంచి అల్లుడు వచ్చాడు

* * *

దినాలు దొర్లిపోతున్నాయి సిమ్మాద్రి (అప్పి రెండో కూతురు) పెళ్ళి రోజులు దగ్గరపడుతున్నాయి సామాన్లు కుదుర్చుకోవాలి ఇప్పటికే చాలా అప్పులున్నాయి వడ్డీలు పెరుగుతున్నాయి కొత్త అప్పు ఎలా చెయ్యగలదు, తాను మజ్జిగ, పాలు అమ్మిన బాపతులో మిగులుస్తూ వచ్చింది, అయిదు, పది చొప్పున వాళ్లకీ వీళ్ళకీ అణా వడ్డీలకు యిచ్చిన మొత్తం దగ్గర దగ్గర యాభైరూపాయలవరకూ రావలసివుంది వెంకయ్య అరవైరూపాయలు యిస్తాడు. మరో యేభై అరవై వుంటే కార్యం గట్టెక్కిపోతుంది ఇంక అప్పుల సంగతా? ఆ తరువాత తాపీగా చూచుకోవచ్చు, అప్పు లేని వాళ్ళూ, ముప్పురాని వాళ్ళు యెవరున్నారీ ప్రపంచంలో? ముందు కార్యం ముఖ్యం. వెంకయ్య వాలకం చూస్తే ఏదో ఘోరం తలపెడుతున్నట్టే వుంది అరవై రూపాయలూ ఒక్కమారే యిచ్చేస్తాడో తన్ను నట్టేట్లో ముంచుతాడో అయినా కాయితంమీద రాయించుకుంటోంది కదా ఏం జరుగుతుందో చూదాం ఎందుకయినా మంచిది మునసబు గారి చెవిలోనూ, డాక్టరుగారి చెవిలోనూ ఈసంగతి ఊదాలి-అంటూ అప్పి ఊహించుకుంటూ వస్తోంది

అనుకున్న మూడువందల అరవైఆరు రోజులూ గతించాయి ఒకరోజున అప్పి యీ సంగతి వెంకయ్యకి జ్ఞాపకంచేసి, తన కూతురు పెళ్ళి దగ్గిరపడిన సంగతికూడా

# ★ కాసుకి దాసులు ★

చెప్పింది ఈ అరవైరూపాయలే కాక, మరో వంద రూపాయలు యెలాగన్నా సర్దుబాటు చేయించి, ఆ కార్యం కాస్తా గట్టెక్కించాలని బ్రతిమాలింది 'సరే చూద్దాం లేవే' అన్నాడు వెంకయ్య

శివరాత్రి వచ్చింది. వెంకయ్యకి శివరాత్రి మహత్యంలో మాత్రం గట్టినమ్మకం వుంది ప్రతిసంవత్సరం శివరాత్రి మహోత్సవం ఉత్సాహంతో మహావైభవంగా జరిపిస్తున్నాడు తొలిరోజున భజనలు వగయిరా కాలక్షేపాలు, మర్నాడు భక్తవరులకు భోజనాది సత్కారాలు.

వెంకయ్యకి చాలాకాలం సంతానం కలుగలేదు మూడో పెళ్లి పెళ్ళానికి మాత్రం స్వప్నంలో శివుడు కనిపించి శివరాత్రి ఉత్సవాలు జరిపించమన్నాడట. మొదటిమారు ఉత్సవం జరిపించాడు సంవత్సరం తిరక్కముందే వంశవర్ధనుడు పుట్టాడు. అతని ఆనందానికి మేరలేదు యిప్పుడతను అరవైయోపడిలో వున్నాడు • అప్పుడే ముగ్గురు పిల్లలతండ్రి అయాడు

యీ సంవత్సరం కూడా ఆ రెండు రోజుల కార్యక్రమం గత సంవత్సరం కన్నా అత్యద్భుతంగా జరిగించాడని గ్రామస్థులు చెప్పుకున్నారు అప్పికి యీ రెండు రోజులూ ఊపిరి తీసుకుందికి కూడా వెసులుబాటు లేకపోయింది రెండవరోజున అందరి భోజనాలూ పూర్తిఅయాక, అంట్లన్నీ శుభ్రంగా తోమి, యింకా చిల్లర మల్లర పనులన్నీ మిగులలేదనిపించి, యజమానురాలి ఆజ్ఞ తీసుకొని యింటికి వచ్చింది. ఆ దినం వెంకయ్య పెట్టించిన అన్నం అందరి భోజనాలు అయాక మిగిలినదాంట్లో కొంతభాగం అప్పి యింట్లోని వారంతా కమ్మగా తిన్నారు యింటికి చేరుకున్నదే తడవుగా, ఆయాసం తీర్చుకుందికిగాను, పక్క వేసుకొని, అప్పి కొంచెం మేను వాల్చింది

అది కూలీలు మాత్రమే కాపురం వుండే వీధి అన్నీ తలదాచుకుందికి కట్టుకున్న కొంపలే ఒక క్రమంలో వుండవు ఆడ, మగా విచక్షణ లేకుండా అంతా రెక్కాడిస్తేగాని డొక్కాడవు పని దొరికిననాడు, దొరికిన వాళ్ళకు దొరుకుతుంది, లేనివాళ్ళకు లేదు. పూట భత్యం, పుల్లల వెలుగే వాళ్ళ జీవితం పగలంతా ఏదో ఒక పని చేస్తారు ఆడవాళ్లు సాయంత్రం మగాళ్ళకంటె ముందుగానే యిళ్ళకు వస్తారు పిల్లల తల్లులయితే పిల్లలకు పాలిస్తారు గూటిలో పిడతలో దాచుకున్న కానీ పరకావుంటే తీసి, మంచి నూనె సీసా, కిరసనాయిలు బుడ్డీ, చిన్న బుట్టా పట్టుకొని ప్రతియింటి యిల్లాలూ బజారుకు పోతుంది కానీ చింతపండు, కానీ మిరపకాయలు, కానీ మంచినూనె, కానీ కిరసనాయిలూ, కానీ మసాలా సామాను, ఉల్లిపాయ కొసరు, ఒక అణా కూర, పావలా తెల్లదుంపలు, పావు సేరు బియ్యం, పిల్లలకి అర్థణా జంతికలు కొనుక్కొని యింటికి చక్కా వస్తారు కూలినాలి చేసికొని తిరిగి వచ్చేటప్పుడే ఎండు కంపా, గంటికర్ర వగయిరా తెచ్చుకొని వుంటారు ఈ తొక్కుతో పొయ్యి వెలిగించి వంటచేస్తారు చోళ్లా, గంటెలూ వున్నవాళ్లు తిరగలివేసి పిండి విసురుకొని అంబలిగాని, తోపగాని చేస్తారు ఈలోగా మగవాళ్లు వస్తారు వచ్చేసరికి ఆకాళ్ళు యిన్ని వేన్నీళ్ళు కాచి పడేస్తారు స్నానాలు చేసేవారు కొందరు మంచాలు వాల్చి పిల్లల్ని దగ్గర కూర్చొపెట్టుకొని పాటలు పాడేవాళ్లు కొందరు తీరుబాటుగా అచ్చట్లు ముచ్చట్లు చెప్పుకునేవారు కొందరు కూలిడబ్బులు, వసూళ్లకోసం పనిచేయించుకొన్నవారి దగ్గరకు పోయేవారు కొందరు—యిలా పేట పేటంతా సాయంత్రం అయిన తరువాత సందడిగా వుంటుంది

ఒక అరగంట కునుకు తీసిందో లేదో అప్పి పెద్దకూతురు వచ్చి అప్పిని లేపింది ఎవరో పోలీసాయన వచ్చారంటూ ఎందుకు చెప్మా అని ఆలోచిస్తూ ఆందోళనతోనే లేచి, అప్పి ఆ పోలీసాయన దగ్గరకు వెళ్ళి "ఏం బాబూ, పిలిచారట?" అని అడిగింది

"ఉన్నపాళంగా నిన్ను యినస్పెక్టరు గారు రమ్మంటున్నారు" అన్నాడు జవాను. అప్పి గుండెలో రాయిపడింది

"నేనేం చేశానని బాబూ?"

"ఏమో, అక్కడే చెప్తారు పద" అంటూ గర్జించాడు పోలీసు కానిసేబిల్. అప్పుడే యింటిల్లిపాదీ ఒక్కమారే కిలిల్లుమన్నారు. బరువెక్కిన హృదయంతో, తడబడుతున్న అడుగులతో అప్పి పోలీసుస్టేషనుకు జవాను వెంట వెళ్ళింది

"అప్పీ, నువ్వు వెంకయ్యగారబ్బాయి మెళ్లో గొలుసు తీశావట తిన్నగా యిచ్చేస్తావా, లేకపోతే నాలుగు తగలాలా?" అంటూ యినస్పెక్టరుగారు అప్పిని చూచీ చూడడంతోనే అడిగారు

అప్పి ఒక్కనిమిషం ప్రాన్పడిపోయింది గజగజ గణికిపోతూ, ఆరిన పెదవులు తడుపుకుంటూ "నేనే కర్మం యెరగను బాబూ! ఆరి పిల్లల్ని ఆ సందట్లో యెత్తుకోవడం యెత్తుకున్నాను గాని-మెళ్లో గొలుసున్నదీ లేనిదీ నాకేమీ తెలీదు బాబూ! యిన్నేళ్లయింది యింతమందిదగ్గర పనిచేశాను గాని నాకీ పాడుబుద్ధి ఎప్పుడూ లేదండీ" అంటూ యినస్పెక్టరు కాళ్ళు పట్టుకొని భోరున యేడవడం మొదలుపెట్టింది

"ఈ దొంగవేషాలు నాదగ్గర పనికిరావు. ముందు వస్తువక్కడ పెట్టి మాట్లాడు" అంటూ యినస్పెక్టరు గద్దించాడు ఆయన ఉద్యోగధర్మం అది మెత్తదనం చూపిస్తే కార్యం సానుకూలమవుతుందా?

ఈలోగా జనం స్టేషను చుట్టూ దూర దూరాల మూగారు వెంకయ్య యెంతకైనా తగినవాడేనని కొందరూ, అప్పికి తగిన ప్రాయశ్చిత్తమే అయిందని కొందరూ వ్యాఖ్యానిస్తున్నారు ఇదిలా వుండగా అప్పి అల్లుడువల్ల యీ సంగతి తెలుసుకొని డాక్టరుగారు స్టేషనుకు వచ్చారు. ఇనస్పెక్టరుగారు వారిని ఆహ్వానించి కూర్చొబెట్టారు "ఏమిటి సంగతి?" అంటూ డాక్టరుగారు ప్రశ్నించారు వెంకయ్య తనవద్దకు వచ్చి, ఉత్సవం సందట్లో పిల్లాడి మెళ్ళో గొలుసు పోయిందనీ, ఏ సమయంలో పోయిందో తెలియదనీ,

యీసాయంత్రం వాడి మెళ్లో చూస్తే కనిపించలేదనీ, అప్పిమీదనే అనుమానం వుందనీ, అది సామాన్యమైన ఆడది కాదనీ చెప్పి వెళ్ళాడని - యినస్పెక్టరుగారు చెప్పారు.

"అలాగా!" అంటూ డాక్టరుగారు అప్పి వైపు ఒకమారు చూచారు.

అప్పి యేడుస్తూ "నాసంగతి తమరికైనా తెలియదా బాబూ! మీ పాదాల సాక్షి నేను ఏ పాపం యెరగను బాబూ!" అంది

డాక్టరుగారు ఒక నిమిషం ఆలోచించి యినస్పెక్టరుగారితో "అయ్యా! దయచేసి నా జామీనుమీద అప్పిని యిప్పటికి విడిచిపెట్టండి ఇది అలాంటి మనిషి కాదని నా నమ్మకం అయినా నేను అడిగి

(56-వ పేజీ చూడండి)

# తాపత్రయం

మిట్టమధ్యాహ్నం పెండ్లి చూపుల కంటూ బయల్దేరమన్నాడు సుందరం. "మరో వేళకి అంటే పిల్ల తండ్రి ఇంట్లో ఉండటం పడదు. నువ్వు కాదూ కూడదు సాయంత్రం వెళ్దాం అంటే, వారు సెలవు పెట్టిగాని ఉండటానికి వీలుండదు ఆలోచించు" అన్నాడు.

శాస్త్రి గంభీరంగా నవ్వాడు. "నన్ను గురించి నీకు తెలియదూ. ఎదుటివాళ్ళకు ఏవిధంగానూ ఇబ్బంది కలిగించను నేను. సరే పద" అన్నాడు శాస్త్రి

శాస్త్రికి నాఅన్నవాళ్ళెవరూ ఆ దరిదాపుల్లో లేరు చిన్నతనంలోనే తల్లీ తండ్రీ చనిపోవటంవల్ల ఏకాకిగా పెరిగినా కష్టపడి చదువుకుని జీవితానికి ఉపయోగించే విజ్ఞానాన్ని ఎంతగానో సేకరించుకున్నానని తృప్తిపడేవాడు

పెళ్ళిచూపులకి శాస్త్రి తరఫున ఎవరూ లేరు; తనూ సుందరం తప్పించి సుందరం అన్నాడు "ఆడవాళ్ళెవరైనా కూడా వుంటే బాగుండేది" అని శాస్త్రి నవ్వి ఊరుకున్నాడు "నాకంత అదృష్టం ఎక్కడిది?" అనుకున్నాడు

* * *

సుందరం, శాస్త్రి గుమ్మంలో అడుగు పెట్టగానే కొండంత మర్యాద చేశారు పంతులుగారు. సుందరం శాస్త్రినిగురించి నాలుగు ముక్కలు చెప్పి ఊరుకున్నాడు శాస్త్రి సగౌరవంగా నమస్కారంచేశాడు పంతులుగారు ప్రతినమస్కారంచేసి హాలులోకి రమ్మంటూ ముందు నడిచారు

హాలంతా తనకోసమని ప్రత్యేకంగా సర్దిఉన్నట్టు శాస్త్రికి అనిపించింది

రెండు కుర్చీల్లోనూ సుందరం శాస్త్రీ ఆసీనులయ్యారు. పంతులుగారు అక్కడే సోఫాలో చతికిలబడ్డారు ముందుగా ఫలహారాలూ, అవీ వచ్చాయి తర్వాత ఆవెంటనే సర్బతులూ, డ్రింకులూ శాస్త్రికి కంపరం బయల్దేరింది అతని సంస్కార హృదయం ఒక్కమారు వెన్నుతట్టినట్టయింది

"క్షమించండి. ఈఆడంబరాలకి అతీతంగా వ్యవహరించాలని నా అభిమతం. వచ్చిన పనేదో పూర్తిచేసుకుంటే అది ముఖ్యం చూశారూ? ఈరోజుల్లో ఇవి పరిపాటి అయిపోయాయి" నిస్పృహతో నిట్టూర్చి "మీరు మర్యాదకోసం దానికేముంది అనొచ్చు. అదిమాత్రం ఎందుకు? పరస్పరం అనురాగం, మామీద మీకు, మీమీద మాకు ఉండాలి గాని, వీటితో అవి ఋజువవుతాయి అనుకోవటం పొరపాటు నాకు చాలా సంబంధాలొచ్చాయి నాకు నచ్చక కొన్నీ, వాళ్ళకి ఇష్టంలేక కొన్నీ తిరిగిపోయాయి అనుకోండి అయితే ముందే నిష్కర్షగా చెప్పేవాడ్ని; కేవలం పెళ్ళిచూపుల కంటూ డబ్బు వృథా చెయ్యొద్దని"

పక్కనున్న సుందరం ఆశ్చర్యపోయాడు. పంతులుగారు నిశ్చేష్టులయి తర్వాత పెద్దగా నవ్వేశారు "అలాగేలెండి మీ రన్నది నిజం కాదనను మా బాగు కోరేగా మీరు చెప్పేది" అన్నారు సర్దుకుంటూ.


శ్రీ పురాణం సూర్యప్రకాశరావు


తర్వాత పంతులుగారు ఎంతె బలవంతం చేసినా ముందు ఆ ఫలహారాలు అక్కడ్నించి కదుపుతే గాని మాట్లాడనని శాస్త్రి కుర్చీలోంచి కదలకుండా బిగుసుకుపోయి కూర్చున్నాడు గుమ్మంవార నిల్చున్న పెళ్ళికూతురు తల్లి నోరు నొక్కుకుంది.

"పోనీ కాఫీ అన్నా పుచ్చుకోండి" అన్నారు పంతులుగారు

"క్షమించండి" అన్నాడు శాస్త్రి సుందరానికీమాటు అరికాలిమంట నెత్తికెక్కింది. లోలోపల విసుక్కున్నాడు. శాస్త్రి "త్వరగా కానివ్వండి" అన్నాడు

కొద్ది క్షణాలకి పెళ్ళికూతురు రావటం, తనముందు కొంత దూరంలో కూర్చోవటం జరిగింది పంతులుగారి ముఖంలో ఆతృత ప్రతిఫలిస్తోంది శాస్త్రి చూసీ చూడనట్లుగా ఆ పిల్ల ముఖంలోకి చూస్తున్నాడు. పిల్ల తరఫు ఆడంగులు గుమ్మం వారనే నిల్చున్నారు.

"ఓ పాట పాడమ్మా వింటారు" అన్నారు పంతులుగారు ఆ అమ్మాయి గొంతు సర్దుకుంటోంది

శాస్త్రి చప్పున "అక్ఖర్లేదు పాడకండి నే నిందాక చెప్పాను చూశారూ. మనిషి అభిమానం చంపుకుని చేసేపన్లండి ఇవి. ఇప్పుడా అమ్మాయి బాగా పాడొచ్చు; పాడలేకపోవచ్చు నాకు సంగీతం అంటే ఇష్టం లేదనుకునేరు! చెవికోసుకుంటాను. కాని సందర్భం వేరు. పరీక్షగా ఎదురుగ్గా కూర్చుని అలా అనటం ఆ అమ్మాయిని ఆజ్ఞాపించి నట్లుంటుంది ఆ అమ్మాయిమాటెల్లా ఉన్నా, నామటుకు నాకు పుట్టెడు అభిమానం వేస్తుంది ఈ దురాచారం నశించాలనే మనందరం కోరాలి" కాస్త ఆగి నిట్టూర్చాడు.

పంతులుగారు "అమ్మాయీ! ఇంగ్లీషులో ఓ వాక్యం రాయి దస్తూరీ ఎలాగుందో చూస్తారు"

శాస్త్రి కీమాటు చిరాకు వేసిన మాట నిజం కొద్ది కఠినంగానే "మీ రింకా నన్నర్థం చేసుకోనందుకు చాలా విచారిస్తున్నాను ఆమె పాటా పాడక్కర్లేదు. ఇంగ్లీషు వచ్చో రాదో అని సందేహం కూడా నాకు లేదు ఇకముందు లేచి అలా ఓసారి నడు, ఓ నాలుగు గుంజీలు తియ్యి ఏం అక్ఖర్లేదు నాకు ఆ అమ్మాయి చదవటం వల్ల కలిగే లాభం ఏమీ లేదు దేవుడిదయవల్ల నేనే ఏదో సంపాదించుకుంటున్నాను ఇద్దరికి చాలకపోదు. మీరు ఆశ్చర్యపోతారు ఎవరికి వాళ్ళం సంస్కారం సంస్కారం అంటూ నెత్తి మొత్తుకునేం లాభం చెప్పండి తమ విషయం వచ్చేసరికి లోకంతో పాటే అనుకుని తప్పుకుంటాం తరుచు మీరు ఉపన్యాసాల్లోనూ, కథల్లోనూకూడావింటూనే ఉంటారనుకుంటా ఈ పెళ్లిచూపుల తతంగాన్ని వేలంపాట అని కొందరూ, అవమానం అని కొందరూ, సంతలో అమ్మకం అని కొందరూ స్త్రీలపట్ల సానుభూతితో ఈనాటి యువకులధోరణిని నిరసిస్తూ ఎన్ని కథలు చదువుతున్నాం! ఎంతమంది చెప్తుంటే వింటున్నాం మీకు తెలిసే ఉంటుంది; వీరేశలింగం గార్ని గురించి గొప్ప సంస్కారి. అటువంటివాడ్ని పట్టుకుని చితకతన్నటానికి ప్రయత్నించారు కొంతమంది పెద్ద మనుషులు అత్యాచారాలు, అన్యాయాలు, మూఢనమ్మకాలూ పెచ్చుపెరిగి పోతున్నాయండీ ఎవరో అన్నారులెండి 'మూఢనమ్మకాలున్న మనిషితో వాదించటం అంటే తమ నీడతో తామే కుస్తీ పట్టిన

సుందరం కలుగజేసుకుని "ఆరుగురని చెప్పలా. ఈ అమ్మాయి రెండో పిల్ల." అన్నాడు.
శాస్త్రి నిట్టూరుస్తూ "మీరు మహాపాపం చేసుకున్నారండీ!" అన్నాడు



ల్లవుతుందని ' ఎందువల్లనంటే చివరికి ఓడి పోయేది మనమేగా మనకే అలుపొస్తుంది అల్లా ఉంటుంది"

ఈ ధోరణిని ఆకట్టటానికే అన్నట్టు సుందరం "పంతులుగారూ పిల్లని చూశాంగా తరవాత విషయాలు మాట్లాడటానికి ఎప్పుడు వీలుంటుందో కాస్త సెలవిస్తే మేం సిద్ధంగా ఉన్నాం మా శాస్త్రి తరఫున నేను తప్పితే ఎవరున్నారో మీకు తెలియంది కాదు"

పంతులుగారు వెంటనే "ఎప్పుడో ఎందుకు ఇప్పుడే మాట్లాడుకుందాం" అన్నారు

ఈ పదినిముషాలూ ఆడంగులు ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు దవడలూ, మూతులూ నొక్కుకుంటూనే ఏదో వింత వస్తువుని చూసినట్టు చూస్తున్నారు శాస్త్రిని.

* * *

"నాగురించి ప్రత్యేకంగా నే చెప్పనక్కర్లేదు సుందరానికి తెలుసు చిన్నతనంనుంచీ మా కుటుంబంతో పరిచయం ఉంది నేనూ ఏమంత ఉన్నవాణ్ణి కాను" అర్థోక్తిలో ఆగి "మీ కెంతమంది ఆడ పిల్లలండీ?" అని అడిగాడు శాస్త్రి సుందరం కలగ చేసుకుని "ఆరుగురని చెప్పలా. ఈ అమ్మాయి రెండోపిల్ల" అన్నాడు

శాస్త్రి నిట్టూరుస్తూ "మీరు మహాపాపం చేసుకున్నారండీ?" అన్నాడు

పంతులుగారిముఖం వెలవెలపోయింది

సుందరానికి ఒళ్లంతా తేళ్లూ, జెర్రులూ పాకుతున్నట్టుంది "అంటే వాడి ఉద్దేశం మీకు తెలిసేఉంటుంది ఈ రోజుల్లో ఇంతమంది ఆడపిల్లల్ని పెంచి పెద్దచేసి పెళ్ళిళ్ళు చెయ్యటం అంటే ఎంత కష్టమయిన విషయమో ఆలోచించండి అదీ! వాడిప్పుడు చెప్పేది" అంటూ సర్దేడు సుందరం శాస్త్రి ఇంత ముఖం చేసుకుని అంతేనంటూ ఆ అభిప్రాయాన్ని బలపర్చాడు.

పంతులుగారు మెల్లగా నసిగారు "కట్నం?" అని శాస్త్రి ఈ విషయంలో సుందరాన్ని నోరు మెదపనివ్వలేదు

"కట్నం దమ్మిడీ పుచ్చుకోను. నేను పూర్తిగా మనిషిని" అంటూ శాస్త్రి రొమ్ము విరుచుకున్నాడు

పంతులుగారు ఆశ్చర్యంతో "అంటే?" అన్నారు

"అంటే ఏముంది ఇంతకు ముందే కదండీ మీరన్నది మీరూ ఏమంత ఉన్నవారు కాదు గంపెడు సంసారం. పెళ్ళి కావల్సిన ఆడపిల్లలు ఎదుగుతున్నారు. మీ పరిస్థితులన్నీ ఓ పక్కనించి చెప్తూనే కట్నం విషయం ఎత్తుతున్నారంటే ఆశ్చర్యంగా ఉంది మీరు నన్నంత మూర్ఖుడని భావిస్తున్నారా చెప్పండి?" అన్నాడు

పంతులుగారు పూర్తిగా అయోమయావస్థలో పడిపోయారు.

సుందరం కుర్చీలోంచి లేచి "సరే వస్తాం మా అభిప్రాయం తెల్సిపోయిందిగా. సాయంత్రం నేను వస్తాను" అంటూ నమస్కారం చేశాడు శాస్త్రికూడా నమస్కారం చేసి కుర్చీలోంచి లేచాడు.

# డాబుసరి

## శ్రీమతి శిరుగూరి రత్నమ్మ

నేను మామూలుగా కాలేజీనుంచి వచ్చి తలమీద బరువు (హేట్) స్టేండ్‌కి తగిలించబోతూండగా కిటికీలో పోస్టు కవరు కనబడింది. ఆ కవరు చూడగానే అది ఎక్కడనుంచి వచ్చిందో పోల్చుకున్నాను వెంటనే విప్పి చదివాను మామగారు 'పండుగ పదిరోజులుందనీ పెళ్ళి అయి రెండేళ్ళు కావస్తూన్నా ఒక్కసారికూడా ఎప్పుడూ ఏపండుగకూ రాలేదనీ ఈ ఉగాదికి తప్పకుండా రావలసింద'నీ వ్రాశారు ఆ వుత్తరం ఎవరు డిక్టేటు చేయింపించారో ఊహించుకోడానికి నాకు ఆట్టే టైముపట్టలేదు

ఉగాదిపండుగ సోమవారం అయింది ఆది, సోమవారాలు సెలవులు కలిసొచ్చాయి ఇంకొక నాలుగురోజులు కాలేజీకి కాజువల్ లీవుపెట్టి శనివారం సాయంకాలం బయలుదేరి వెళ్ళితే నాలుగురోజులు రాణీగారిదగ్గరవుండి సోమవారం కాలేజీ వేళకు రావచ్చు, అనుకున్నా ఏ కళనున్నాడో గాని మా ప్రిన్సిపాల్ నేను లీవు పెట్టగానే వప్పుకున్నాడు

పెట్టే బేడా సర్దుకుని గుంటూరుకి ప్రయాణం కట్టాను మొదట సర్ ప్రైజ్ విజిటుగా వెళ్ళి మా ఆవిడను సంతోషంలో ఉక్కిరిబిక్కిరి చేయాలనుకున్నా. కాని, స్టేషనులో దిగి సామాను దింపించుకుని రిక్షావాళ్లతో బేరంఆడడం, ఇదంతా న్యూసెన్స్; ఎందుకొచ్చిన గొడవ అనుకుని నేను వస్తున్నానని స్టేషనుకు కారుపంపమని మామగారికి టెలిగ్రాం ఇచ్చాను అది చూచుకుని ఆయన చాలా సంతోషించి బెజవాడకే కారుతో సహా ఏతెంచి నన్ను ఆహ్వానించి తీసుకెళ్ళారు నన్ను చూచిన దగ్గర్నుంచి మా ఆఖరుబావమరది రాంబాబు ప్రశ్నలవర్షం కురిపించసాగాడు మా ఇల్లాలిమీదికి వురుకులు, పరుగులు ఎత్తుతున్న నా మనస్సును ఎంతో ప్రయత్నముమీద మళ్ళించుకుని, వాడి ప్రశ్నలకు జవాబులు చెప్పుతున్నాను నా పరధ్యానానికి మామగారు చిన్న చిరునవ్వు నవ్వుకుంటూ, మధ్యమధ్య "బావను పూరికే విసిగించకు బాబూ" అని కొడుకుని మందలిస్తున్నారు ఎప్పటికీ ఆ మాయగుంటూరుకళ్లబడదిదేమి ప్రారబ్ధం, రైల్లో వెళ్ళివుంటే ఈపాటికి చేరివుందుమని నాకు మనస్సులో చాలా చిరాకుగా వుంది ఆఖరికి ఎలాగైతేనేం కొంచెంసేపటికి ఇల్లంటూ కనబడింది

మామోటారు ఇంటి మలుపు తిరగడమూ వీధి అరుగుమీదనుంచి ఒక పదహారేళ్లమ్మాయి ఇంట్లోకి ఛెంగుమని లేడి పిల్లలా గదుమికి పారిపోవడం ఒక్కమాటే జరిగింది ఈ మధుకలశము నాదేకదా అని ఒకసారి వుప్పొంగిపోయ్యాను వళ్ళు పులకరించి చిరుచెమట పోసింది

మేము దిగేసరికల్లా మా అత్తగారు, చిట్టిమరదలువచ్చి వసంతం దిగదుడిచి పారపోసి హారతి ఇచ్చారు.

"హైద్రాబాదు నబాబులు మన పిచ్చి ఆచారాలు చూచి నవ్వుతారోయ్" అని మామగారు అన్నారు నేనేమీ జబాబు చెప్పలేదు నా కళ్ళు దేనికోసమో వెదకుతున్నాయి నా అభీష్టవస్తువు సిగ్గుతో ఏమూల నక్కిందో కనబడలేదు. నా సూటుకేసు తెరచి రాంబాబుకి క్రికెట్టు బాటూ, బంతీ, చిట్టి మరదలి రమకి రిబ్బన్లు, ప్లాస్టిక్ గాజులు, దంతం బ్రూచ్ తీసిఇచ్చాను మామగారికోసం తెచ్చిన చేతికర్ర బీదరీ వర్కుది, ఒక సిగరెట్టు కేసు, యాష్‌ట్రే తీసిఇచ్చాను

"ఇప్పుడివన్నీ ఎందుకు బాబూ అనవసరంగా తీసికొచ్చావు బోలెడు ఖర్చు" అని మామగారన్నారు

ఇంతలో "బావోయి సరే గాని మా అక్కయ్యకి ఏమి తెచ్చావు?" అని రమ అడిగింది "నేనే వచ్చాను చాలదూ?" అని నే బదులు చెప్పాలనుకున్నా, కాని ఆమాట గొంతులోనే వుండిపోయింది.

మామగారందుకుని "మీ అక్కయ్యకి ప్రత్యేకంగా ఇస్తాడు గాని అందరి ఎదుటా ఇస్తాడేమిటి బావ?" అని చేతికర్ర పనితనం పరీక్షచేస్తూ జబాబు చెప్పారు.

భోజనాలు అయినాయి అప్పుడు కూడా మా ధర్మపత్ని కనబడలేదు కనీసం నెయ్యి అయినా వడ్డించేందుకు వస్తుందేమో అని చూశా ఆ పని కూడా మా అత్తగారే పుచ్చుకున్నారు నాకోసరం ప్రత్యేకించిన గదిలోకి వెళ్లేసరికి అక్కడ నాఆరాధ్యదేవత తాంబూలం పళ్లెం పట్టుకునిల్చుంది నన్ను చూడగానే శ్యామ పారిపోబోయింది

"ఏమి శ్యామా! ఇంత సిగ్గెప్పుడు నేర్చుకున్నావు" అని ఆమె చెయ్యి పట్టుకుని దగ్గరకు తీసుకున్నా శ్యామ బుగ్గలు సిగ్గుతో కించిత్ అరుణరాగం దాల్చాయి తరువాత నేను తనకోసరం తీసుకొచ్చిన నీలిరంగు జార్జెట్టు చీర, కాటన్ జాకెట్టు బట్ట, ఒక కాశ్మీర్ టాయిలెట్టు బాక్సు తీసిఇచ్చాను.

"బాగున్నాయా"?

"చాలా బాగున్నాయి" అనేసి వెళ్ళిపోయింది

* * *

ఈ వారంరోజులు చాలా ఆనందంగా గడిచిపోయాయి నేను వెళ్లేరోజు దగ్గరకొచ్చింది శ్యామకు నా దగ్గర కొంచెం చనవు ఏర్పడింది సిగ్గుతెర కొంచెం తొలగింది శనివారం సాయంకాలం కాఫీ టిఫిన్ తనే తీసుకువచ్చి నాముందుపెట్టి ఏదో చెప్పదలచుకొన్నట్టు ముఖం పెట్టి నిల్చుంది. అది చూచి "ఏమిశ్యామా ఏమిటి" అని అడిగాను

"రాంబాబు సినిమా కెళ్ళదామని పూరికే అంటున్నాడు"

"సరే దానికేం అలాగే వెళ్ళదాము మీ తమ్ముడికేగాని నీకు చూడాలని లేదా ఏం? తొందరగా తెమలండి నువ్వూ నీ చెల్లెలూను. నాన్నగారుకూడా వస్తారా?"

"ఎందుకు? నేనడగను. కావాలంటే అడగవచ్చు"

శ్యామ అట్లెందుకు అందో నేగ్రహించా. "కానీ వెళ్లు" అన్ని శ్యామను పంపించా.

ఈమధ్య అమరావతి, జాగర్లమూడి, ఎత్తిపోతల, మంగళగిరి మొదలైన స్థలాలు చూడడానికివెళ్ళి డబ్బులు మంచినీళ్ళలా ఖర్చుపెటాను. ఈ సినిమాకు ఎంత ఇదయినా ఒక పదిరూపాయిలనోటు ఖర్చవక మానదు. పర్సుతీసి చూశా సరిగా ఇరవైరూపా

తొంగిచూస్తూ తలుపుతీసుకు దిగపోతున్నాడు. ఇక వా డెలాగూ వదిలిపెట్టే రకం కాదుకదా అని నేనే వెళ్ళా.

"ఎక్కడకురా ప్రయాణం" అని గోపి అడిగాడు

"గుంటూరునుంచి హైదరాబాదు వెళ్ళుతున్నా" అని వాడు అడుగబోయే రెండవ ప్రశ్నకుకూడా ముందుగానే చెప్పి తప్పించుకు పోదా మనుకున్నా.

"అరె నేను హైదరాబాదు వెళ్ళుతున్నా, ఇక్కడే కూచుందుగాని నీ సామాను పట్టించుకు వద్దాంరా?" అని నా చెయ్యి పట్టుకు గుంజసాగేడు తల పైకెత్తిచూశా ఇంటరు అని వ్రాసివుంది సరే, ఇంటరైతే ఫరవాలేదు నా సొమ్ము పరిపోవచ్చు ఇంటికెళ్ళినతరువాత చూచుకోవచ్చు, అనుకుని కూలీని వెదకడానికి వెళ్లాము అప్పటికప్పుడే వాడు ఒకబండీలో సఖం సామాను పెట్టేశాడు.

"ఇదేమిటి ఇక్కడపెట్టుతున్నావు నేను చెప్పుతా నాతోకూడా రా" అని వాడితో అన్నా. "నా సామ్మెంబోను ఏడెట్టమంటే ఆడ నేయెట్టుతా"అని వాడు పెట్టినసామానులన్నీ తీసుకొచ్చి, ఇంటరుక్లాసులో పెట్టమంటే నాకేసి తెల్లపోయిచూస్తూ సామానులన్నీ సర్దిపెట్ట వాడికూలి చేతిలో వేయించుకు చక్కాపోయేడు వాడిధర్మమా అని మరి ఏమీ వాగలేదు

"నేను టిక్కట్టు కొనుక్కొస్తానుగోపీ," అని చెప్పి టక్కట్టుమార్చుకుందుకు స్టేషను లోకి వెళ్ళా నేను వచ్చే అంతలో రైలు కదలసాగింది గోపీ కంపార్టుమెంటుదాకా వెళ్లడానికి వ్యవధానం లేకపోయింది గార్డు కంపార్టుమెంటుపక్క బండీలోకి ఎక్కా. కొంచెంసేపటికి పక్కస్టేషనులో రైలాగింది నేను దిగి గోపీ కంపార్టుమెంటులోకి వెళ్ళిపోయాను

నన్ను చూడగానే వాడు "ఏంరా ఇంత ఆలస్యం చేశావు? నేను నీకోసరం చాలా చూశా నీ వెప్పటికేరాలే. నీకు, నాకు కూడా భోజనాలు డోర్నకల్ లో ఇవ్వవలసిందని గార్డుకు చెప్పా" అని మహా గొప్ప వుపకారం చేసినట్లుగా అన్నాడు

చచ్చాయురా భగవంతుడా వీడి దొక తద్దినం పెడుతుగట్టాడు వీడిని ఎవరు చెప్పమన్నారు నా దగ్గర మస్తుగా వున్నాయి ఫలహారాలు అవి ఇన్ని తిని ఇన్ని నీళ్ళు తాగి పడుకుందామని నేననుకుంటూంటే, శనేశ్వరంలాగ వీడొకడు దాపరించాడేమిటి భగవంతుడా, నా దగ్గర వున్నది ఒక రూపాయి ఎనిమిదణాలు ఇందులో భోజనానికేమిస్తా? కూలివాడికేమిస్తా? మారడపల్లిపోవాలాయే బస్సుస్టాండుదాకా టాంగాకి డబ్బుకావాలె, ఆపైన బస్సు టిక్కట్టుకు కావాలే ఏమిటి గతి భగవంతుడా, అని ఆలోచన మొదలెట్టా.

"ఏమిటిరా దాసూ దీర్ఘంగా ఆలోచిస్తున్నావు?" అని అడిగాడు గోపి

"ఏంలేదురా రాత్రి మనం పడుకుందుకు జాగా దొరుకుతుందో లేదో అని చూస్తూన్నా."

"పరవాలేదు డోర్నకల్ లో భోజనం కాగానే అప్పుడే బర్తు ఎక్కి పడుకుందాము" ఇంతలో డోర్నకల్ రానూ వచ్చింది మా భోజనాలు వచ్చాయి డబ్బు పోతేపోయిందికాని భోజనం మట్టుకు ఇంగ్లీషు లేకన్నా చాలా రుచికరంగా వుంది. సుష్టుకృతుగా భోంచేసి త్వరగా చెయ్యి కడుక్కుని పైకిఎక్కి బెడ్డింగు పర్చుకొని శయనించా. నాకన్నా అయిదారు నిముషాలు ఆలస్యంగా పడుకున్నాడు గోపి

నాకు గుండెలు పీచుపీచుమంటున్నాయి కళ్లు గట్టిగా మూసుకుని భగవన్నామస్మరణ చేసుకుంటున్నా ఇంతలో పక్కస్టేషను వచ్చింది బాయ్ వచ్చి మేము వదలిన ప్లేట్లు తీసుకుని "సార్, సార్" అని పిలవడం మొదలెట్టాడు నేను వులక్కుండా పడుకున్నా. మా గోపీకికూడా నిజంగా నిద్రపట్టిందో, లేక నాలాగే దొంగ నిద్రపోయాడో గాని వాడూ లేవలేదు

క్రింద బర్తుమీద కూర్చున్న మార్వాడీ సేటు "అరె అభీ ఖానాఖాయ్ ఇత్ నా జల్దీ సోగయ్" అని నేపధ్యంలో అనుకుని, బాయ్ ని 'ఒక భోజనం ఎంత ఖరీదు'? అని అడిగాడు "రెండు రూపాయిలు సార్" అని మార్వాడీసేటుకి జబాబుచెప్పి, మా గోపీని తిరిగి 'సార్, సార్' అని తట్టి లేపసాగాడు

అదృష్టవశాత్తు నన్ను తట్టలేదు నాఅబోరు దక్కింది అని నేను నా కళ్ళు మరింత గట్టిగా మూసుకున్నా పాపం మా గోపీ లేచి అతని చేతిలో నాలుగు రూపాయిలు పెట్టి మళ్ళి నిద్రపోయేడు నా పరువు దక్కినందుకు మనసార భగవంతునికి నమస్కారం చేశా ఇంకెట్టి తికమకలూ లేకుండా తెల్లవారింది క్రిందికి దిగి బెడ్డింగులు కట్టేశాము

తలలో మళ్ళి లెక్కలుఆరంభమైనాయి కూలివాడికి రూపాయిఇస్తేగాని ఈసామాను స్టేషను వతలకువెళ్లదు. అటుతరువాత అథమం మూడు పావలాలైనా ఇస్తేగాని బస్సు స్టాండుదాకా టాంగా రాదు. నా బరువు, సామానుబరువుకు అర్ధరూపాయి ఇస్తేకాని బస్సు మమల్ని ఎక్కనివ్వదు. ఇంక ఎంత లేదన్నా ఇంకొకటి రెండు రూపాయిలు కావాలి ఇక గోపీని అడగక తప్పదు తరువాత వాని కిచ్చేయవచ్చు అనుకున్నా.

ఎన్నడూ ఒకరిని అప్పడిగిన వ్యక్తిని కానేమో తడబడుతూ "గోపీ రెండు రూపాయిలు ఐ జి (ఇండియా గవర్నమెంటురూపాయిలు) వుంటే ఇవ్వరా?" అని అడిగా

దానికి వా డేమనుకున్నాడో ఏమో బహుశా రాత్రిభోజనానికి నేను డబ్బివ్వదలచి అయిదు రూపాయిలు నోటు ఇయ్యడానికి అడిగాననుకున్నారు కాబోలు, "తీరా ఇంటికి వెళ్ళిపోతూ నీకు ఐ జి. ఎందుకురా" అని గట్టిగా నవ్వడం మొదలుపెట్టాడు.

మౌలానా స్టేషను దాటింది సికందరాబాదు స్టేషను దగ్గర పడుతూంది ఇంతలో గోపీ వున్నట్టుండి "దాసూ నాకు కొంచెం హైదరాబాదులో పనివుంది. అది చూసుకుని నేను మధ్యాహ్నం భోజనం వేళకు వస్తాను మావాళ్లిల్లు మీ ఇంటిదగ్గరేగా. నా సామానుకూడా నీవు కాస్త తీసుకెళ్ళి మావాళ్ళింటికి చేరేసి నేను వచ్చానని కాస్త చెప్పేసే" అని అర్ధరిచ్చాడు

నాకు విచారించాలో సంతోషించాలో తెలియలేదు ఇంతలో సికిందరాబాదు రానేవచ్చింది సామాను కూలివాళ్ళకు ఎత్తించా గోపితో "మళ్ళీ మనం సాయంకాలం కలుసుకుందాము గాని రెండు రూపాయిలుంటే ఇవ్వు నీకు తిరిగి సాయంకాలం ఇచ్చేస్తా" అని నోరుతెరచి అడిగా

"ఆరి నీ యిల్లు బంగారంగాను అత్తారింట్లో అంతా ఖర్చు చేసుకొచ్చావా ఏంటిరా. ఆ మాట ఇందాకనే చెప్పలేకపోయావా? అంగుకా రాత్రినుంచి ఇంత నాటకం ఆడావు నీకు నాకు భేదమేమిటిరా? ఇంద తీసుకో" అని ఒక అయిదు రూపాయిల నోటు నామీదకు విసిరాడు.

బతుకుజీవుడా అని అది అందుకున్నా





# విజ్ఞానవీధులు

"డాక్టర్"



## 147. భగవంతుడు ఉన్నాడా?

"భగవంతుడు ఉన్నాడను విషయముపై విజ్ఞాన శాస్త్రమున కెంతవరకూ నమ్మకమున్నది?" అని కొత్తగూడెమునుంచి శ్రీ రామారావుగారు అడుగుతున్నారు.

భగవంతుడున్నాడన్నది నమ్మకము మటుకే విజ్ఞానశాస్త్రపు విషయములవలె నిరూపించడానికి ఆధారము లేదు మానవుడు ప్రకృతిని గురించి ఇప్పటివలె ఎరుగనప్పుడు, కొండనూ, చెట్టునూ, నదినీ, సముద్రాన్నీ, గాలినీ, అగ్నినీ, దేవతలే అనుకుని హిమవంతుడు, కల్పవృక్షమూ, నదీదేవతా, వరుణుడూ, వాయుదేవుడూ, అగ్నిదేవుడూ, అని పేర్లు పెట్టుకుని పూజించాడు. ఇవన్నీ చైతన్యంతో మానవ జీవితాన్ని మార్చడము లేదని తెలుసుకున్న తర్వాత సూర్యుడు, గ్రహములు, దేవతలనుకున్నాడు ఉరుమును ఇంద్రుని రథధ్వని అనీ, పిడుగును చీల అనీ అనుకున్నాడు ఇంద్రధనుస్సు అదే అనుకున్నాడు.

ఈ అభిప్రాయాలతోపాటు మన జీవితావసరము లన్నిటికీ ఒక్కొక్క అధిష్ఠాన దేవత ఉన్నదనే నమ్మకా, మన ఆపద లన్నిటికీ ఒక్కొక్క దేవతే కారణమనే నమ్మకా ప్రబలినవి. ఇవి ముఖ్యముగా భారతదేశపు ఆదివాసులలో, మొదటి నమ్మకాన్ని బట్టియే తలుపులమ్మ, నూకలమ్మ, యెల్లమ్మ, వంటి గ్రామదేవతలూ, రెండవ నమ్మకని బట్టి మారి, అమ్మవారు, వంటి దేవతలూ ప్రవేశించారు. నేటికీ పాటకపు జనము కలరారోజులలో డప్పులు వాయించి అమ్మవార్ని చెదరగొట్ట యత్నించడము కనబడుతుంది. మధ్యతరగతివారి కులపూజలలోని 'కామేశ్వరి' అమ్మవారువంటి దేవతయే

కేవలము నమ్మకమే కాక, కొంచెము ఆలోచనకూడా పనిచేసిన తర్వాత బయల్దేరిన దైవము శివుడు. శక్తివంతముగా బ్రతికి పెరిగే ప్రాణులు నిస్సహాయముగా మరణించి నశించడము గుర్తించి, సృష్టిని నాశనము చేసే పరమశక్తివంతుడే 'పశుపతి' 'శివుడు' అని తర్కించుకుని, ఆయనను ప్రార్థించడమువల్ల లాభమున్నదని అట్లు చేసేవారు.

ఆర్యుల పూర్వులు ద్రావిడులు మధ్యధరా సముద్రతీర దేశములలో, ముఖ్యముగా ఈజిప్టులోనూ, రోములోనూ, సృష్టికార్యమే భగవంతుని కర్మ అన్న నమ్మకా, ఈ నమ్మకవెంటనే లింగచిత్రణమూ బయల్దేరాయి భారతదేశములో ఈ సృష్టికార్యము కూడ శివునికే ఆరోపించబడి లింగార్చనకు దారిచేసినది. ఇది మాత్రమే కాక నాగార్చనకూడ లింగపూజతో జోడించబడినది నేటికీ సంతానములేని దంపతులు రామేశ్వరములో నాగప్రతిష్ఠ చేయడము కద్దు.

ఆర్యుల రాకతో, లింగపూజ కొంత తగ్గి సృష్టిప్రవర్తకుడగు సూర్యుని ఆరాధనా, దానితో సృష్టిపాలకుడగు విష్ణుపూజా బయలుదేరినవి దేవతల ప్రీతికై యజ్ఞయాగాది కర్మలు వెలిశాయి బ్రాహ్మణుడు అవతరించి కర్మకాండను పెంచి దాని ప్రత్యేక హక్కును తనచేతిలో పెట్టుకున్నాడు. క్షత్రియులు ఈ దారుణమును ప్రతిఘటించి బ్రాహ్మణుని అణగత్రొక్కడమూ, బ్రాహ్మణుడు మళ్ళీ విజృంభించి క్షత్రియుణ్ణి అణగత్రొక్కడమూ, క్షత్రియుడు మళ్ళీ లేవడమూ, కార్తవీర్యార్జున, పరశురామ, రామ, గాథలలో కనబడతాయి గొల్లవాడై పుట్టిన (?) కృష్ణుని అవతారము తక్కిన జాతులలో చైతన్యము లేపినది చివరకు క్షత్రియుడు వేరైపోయి బౌద్ధమతము స్థాపించాడు కర్మలు లాభము లేవన్నాడు మహావీరుడు భగవంతుడున్నాడన్న అభిప్రాయాన్నే తుడిచేసి, త్రికరణశుద్ధిపై మొగ్గుదెచ్చాడు

క్రమంగా ఆరో శతాబ్దానికి మళ్ళీ దక్షిణదేశములో అప్పర్ బోధించిన శైవముగాను ఉత్తరమున బుద్ధపూజద్వారా మళ్ళీ లేచిన బ్రహ్మ, విష్ణు, వంటి దైవముల పూజగానూ హిందూమతము విజృంభించింది శంకరాచార్యులు జీవుడు పరమేశ్వరాంశమేననీ, ఈ పరమేశ్వరత్వాన్ని త్రికరణయా సాధించడమే పరమగమ్యమనీ బోధించారు ఆయన కాలానికి, శైవ, వైష్ణవ, శాక్త, గాణాపత్య, కాపాలిక, సౌరమతాలుండేవిట. వీటి నన్నిటినీ చేర్చిపెట్టాడాయన రామానుజులు మొత్తానికి జీవునికి భిన్నుడైన కళ్యాణ గుణాత్మకుని క్షీరసాగర శయనుని భావించి సారూప్య స్థితియే పొందదగిన స్థితి అన్నారు మధ్వాచార్యులు జీవేశ్వరులను పూర్తిగా విడదీసి, సంతత నరకమూ, ముఖ్యప్రాణదేవులూ అన్న క్రైస్తవ నమ్మకాలను మొట్టమొదటగా భారతదేశ వేదాంత దర్శనాలలో ప్రవేశపెట్టినారు సామీప్యమే ఆయన ప్రతిపాదించిన మోక్షము. భక్తిప్రధానమైన, వైరాగ్య ప్రతిపాదకమైన ఇస్లాము ప్రభావం ఏకలింగజీవంటి వారి ఏకేశ్వరారాధనలోనూ, నానకువంటిగురువుల సమన్వయ తత్వములలోనూ కనబడుతోంది. నేటికి దక్షిణాదిని సుబ్రహ్మణ్యస్వామి; కన్నడదేశమున శ్రీనివాసుడూ, తెలుగున నరసింహస్వామీ, ఈశ్వరుడూ, ఓఢ్రదేశమున జగన్నాథుడూ; మహారాష్ట్రమున దత్తాత్రేయులూ, ఘూర్జరమున నీలకంఠుడూ, బంగాళమున కాళీ, సంయుక్తరాష్ట్రమున విశ్వనాథుడూ, పంజాబులో పరమాత్మ ఆరాధ్యదైవములు ఒక్క దేవాలయానికి వెళ్ళితే ఎంతమంది దేవుళ్ళో!

మళ్ళీ ఎవరేనా విమర్శిస్తే 'ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ' అన్న సూత్రాన్ని ఎత్తి చూపిస్తాము

మనము అర్చించేది, కొబ్బరికాయలు కొట్టి, మొక్కులు మొక్కి, మన కోరికల్ని చ్చే భగవంతుణ్ణి వేదాంత గ్రంథాల్లో చెప్పేది సృష్టికి జీవమైన పరమేశ్వరుణ్ణి, భగవంతు డున్నాడా అంటే ఇందులో ఎవర్ని?

"భగవంతుడా? అంటే ఎవరూ?" అని అడుగుతుంది విజ్ఞానశాస్త్రము 'సృష్టికర్త' అంటే 'ఆయనకి కర్త ఎవరూ?' అంటుంది 'ఆయనకి ఆయనయే కర్త' అంటే 'సృష్టికూడా తనకు తానే కర్త కాగూడదా?' అంటుంది

'జీవులందరికీ మూల చైతన్యము' అంటే "జీవులంటే?" అని సందేహిస్తుంది రాయి నుంచి మానవునివరకూ, సృష్టి పరిణామము వల్లనే తయారయాయి అని విశ్వసించే విజ్ఞానశాస్త్రము, చైతన్యాన్ని భూపదార్థానికి విజాతీయముగా గణించదు "అయితే చైతన్యము ఎలాగు కలుగుతుంది?" అని అడిగితే "ఇంకా తెలియలేదు" అని జవాబు చెప్పుతుంది విజ్ఞానశాస్త్రము

విజ్ఞానశాస్త్రపు దారిలో భగవంతుడు అడ్డు తగలలేదింకా విజ్ఞానశాస్త్రము వాఙ్మానసగోచరము భగవంతుడవాఙ్మానసగోచరు డాయెను రెంటికీ సంబంధ మెలాగ?

## 148. నక్షత్రాల దూరాలను ఎట్లు కనుగొంటారు ?

నక్షత్రాల దూరాలను సాధారణంగా 'పేరలాక్స్' (*Parallax*) పద్ధతిని కనుగొంటారు

ఎదురుగానున్న గోడమీద నిట్టనిలువుగా ఒక గీత గీయండి కుడిచేతితో పెన్సిలు ఒకదానిని నిలువుగా పట్టుకొని, ఎడమ కంటిని మూసి కుడికంటితో చూస్తూ, కుడి కన్ను, పెన్సిలు, గోడమీది గీతకూడా ఒకే రేఖలో ఉండేటట్లుగా పెన్సిలు పట్టుకొన్న చేతిని జరుపండి పిమ్మట ఆ చేతిని అట్లే కదపకుండా ఉంచి, కుడి కంటిని మూసి ఎడమకంటితో పెన్సిలును చూస్తే, గోడమీది గీత ననుసరించి పెన్సిలు కుడివైపుకు జరిగినట్లు కనపడుతుంది. ఇక్కడ రెండు కళ్లు రెండు అపేక్షక స్థానాలు అపేక్షక స్థానాల మధ్యదూరం వలన, వెనుకభాగమందున్న గీత ననుసరించి పెన్సిలు దిశలో అభివ్యక్తమయ్యే మార్పునే 'పేరలాక్స్' అని పేర్కొంటారు కంటికి దగ్గరగా పెన్సిలును తీసికొనివచ్చి, పై విధంగానే ప్రయోగంచేస్తే, పెన్సిలు ప్రక్కకు జరిగినట్లు కనపడే దూరం అధికమౌతుంది రెండు అపేక్షస్థానాల మధ్య దూరాన్ని పాదరేఖ (*Base line*) అని అంటారు దీనినిబట్టి పాదరేఖ పొడవు అధికమైన కొలదీ పేరలాక్స్ అధికమౌతుందనీ, అపేక్షస్థానాలనుండి అపేక్షిత వస్తువు యొక్క దూరము తగ్గినకొలదీ కూడ 'పేరలాక్స్' అధికమౌతుందనీ మనకు వ్యక్తమౌతుంది ఈవిధంగా పేరలాక్సుకును అపేక్షస్థానాలనుండి అపేక్షిత వస్తు దూరానికిని, పాదరేఖ పొడవునకును సంబంధముండుట చేత, ఈ సంబంధాన్ని ఉపయోగించి నక్షత్రాల దూరాలను కనుక్కోవచ్చును

'పేరలాక్స్' పద్ధతినిబట్టి, భూమికి చేరువగానున్న చంద్రునివంటి నభోమూర్తి దూరాన్ని కనుగొనాలంటే, ఒక రేఖాంశలో సుమారు 90 డిగ్రీల దూరంలోనున్న రెండు వేధశాలలనుండి ఆ నభోమూర్తి పేరలాక్సును కొలిచి, దానినిబట్టి ఆ మూర్తి దూరాన్ని నిర్ణయింపవచ్చు కాని నక్షత్రాలు భూమికి చాలా దూరంగా ఉండడం వలన, పై వేధశాలలనుండే నక్షత్రాలను అపేక్షిస్తే, వాటి స్థానంలో మార్పేమీ గోచరంకాదు అందుచేత నక్షత్రాల విషయంలో ఎక్కువ పొడవుగల పాదరేఖ కావలసివుంది అందుకై భూకక్ష్యనే (*Orbit*) పాదరేఖగా ఉపయోగించుకొని ఒకే వేధశాలనుండి సరిగా ఆరునెలల కాలవ్యవధిలో నక్షత్రాల దిశలను కొలిచి, వాటి పేరలాక్సును కనుగొంటారు ఈ రీతిగా భూకక్ష్యను ఉపయోగించుకొనడం వలన పాదరేఖ నిడివి రమారమి 186,000,000 మైళ్ళుంటుంది ఇంతకంటె ఎక్కువ పొడవుగల పాదరేఖ మనకు అసాధ్యం

186,000,000 మైళ్ళ నిడివిగల పాదరేఖ చివరలనుండి నక్షత్రాలను అపేక్షించినా కూడా, వాటి స్థానంలో ఎక్కువ మార్పురాదు, అత్యల్పమైన 'పేరలాక్స్'ను మాత్రమే అవి ప్రదర్శిస్తాయి 1 సెకను పేరలాక్సును కలిగియున్న నక్షత్రాలు కూడా వాస్తవంగా ఏమీ లేవు, సెకనుకు చాలా తక్కువగానే నక్షత్రాల 'పేరలాక్స్' లున్నాయి అందుచేత నక్షత్రాల పేరలాక్సును కొలవడానికి మిక్కిలి సుగ్రాహ్యములైన పరికరాలు అవసరం ఇటీవలవరకూ అట్టి సుగ్రాహ్యమైన పరికరాల గుండా కంటితో అపేక్షించి నక్షత్రాల పేరలాక్సును కనుగొనేవారుగాని, ప్రస్తుతము ఛాయాచిత్రగ్రహణపద్ధతిని అందుకై ఉపయోగిస్తున్నారు ఈ పద్ధతిలో సామాన్యంగా ఆరునెలల కాలవ్యవధిలో నక్షత్రాల ఛాయాచిత్రాలను తీసి ప్రత్యేకమైన ఒక రకం సూక్ష్మదర్శినితో వాటిని అనుశీలిస్తారు ఈ అనుశీలనలో చాల నక్షత్రాల సాపేక్షస్థానంలో ఎట్టి మార్పు గోచరము కాదుగాని' మిక్కిలి తక్కువ సంఖ్యగల నక్షత్రాల స్థానంలో కొద్దిపాటి మార్పు వ్యక్తమౌతుంది స్థానమునందు మార్పులేని నక్షత్రాలనుబట్టి స్థానభ్రంశము నొందినట్లు కనబడుచున్న నక్షత్రాల స్థానభ్రంశ పరిమాణమును కొలిచి, దాని పేరలాక్సును గణిస్తారు పేరలాక్స్, పాదరేఖ పరిమితులను బట్టి నక్షత్రాల దూరాలను కనుక్కోవచ్చు

పేరలాక్స్ పద్ధతిని నక్షత్రాల దూరం కనుగొనుట చాల ప్రయాసతో కూడిన పని. ఈ పద్ధతిని ఒక్కొక్క నక్షత్రంయొక్క దూరం కనుగొనుటకు 28 సంవత్సరాలు తక్కువకాకుండా తీసికొంటుంది 1947 వ సంవత్సరానికి రమారమి 5000 నక్షత్రాల దూరాలను పేరలాక్స్ పద్ధతిని శాస్త్రజ్ఞులు నిర్ణయించేరు ఈ 5000 నక్షత్రాలలోను 633 నక్షత్రాలు భూమికి 65 కాంతి సంవత్సరాల లోపులో ఉన్నాయి

—అనంత్.





పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి



దీర్ఘముఖుని పంపివేసి చిత్రవర్ణుడు అరుణముఖుని పిలిచి యిట్లు చెప్పినాడు

"హిరణ్యగర్భుని కొలువున కీక్షణమే పోయి నీవు నిర్భీతిగ నా మాటలు వినిచి తిరిగి రమ్మోయీ!"

అరుణముఖుడు చనిన వెనుక - మంత్రిగారు, రాజుగారు - ఒంటరిగా ఏమేమో - మంతనములు చేసి పిదప - మేఘవర్ణుడను కాకిని - దర్బారుకు పిలిపించిరి

"కర్పూరద్వీపమనెడి - రాజ్యమ్మును మన మిప్పుడు - వశమొనర్చుకోవలసిన - అత్యావసరమేర్పడినది. - నీ విప్పుడే అచటికేగి - ఎట్లయినా ఆ రాజుతో - మాయమాటలాడి యతని - నమ్మకమును చూరగొనుము - ఆప్తుని వలె మెలగుచునే - ఆదేశపు గుట్టుమట్టు - లన్నిటినీ తెలుసుకొనుము - తిరిగి వచ్చి, అవియన్నీ - మాకు తెలియ చేయవలెను!"



మేఘవర్ణుడటేయని కర్పూరద్వీపానికి ప్రయాణమ్ము సాగించెను.




(హిరణ్యగర్భునితో మంత్రి చక్రవాకం)

"ఊరుకున్నవాడూరుకోనక మన - దీర్ఘముఖుడు పరదేశాలకు జేని - విరోధములు కొని తెచ్చాడు - తనకూ మనకూ, మన రాజ్యానికి - కూడా ఆపద తెచ్చాడు"



"మంత్రీ! నీవును అనుభవశాలివి లోకంలో నీ వెరుగనిదుండదు గడచినదానికి విచారమేలా? ముందు చేయదగు పనులను గురించి - యోచన చేయవలె గదా?"



"నాకు చూడగా వెంటనే మనమొక వేగులవానిని పంపించి చిత్రవర్ణుని రాజ్యంలోని పల విశేషాలనూ రహస్యాలనూ తెలుసుకొనుట అవసరమని తోచును"



"అవును సుమా! చక్కటి యోచన అయితే ఎవరిని పంపిద్దాము?"

"ఉన్నాడుగదా దీర్ఘముఖుండూ! అతనితో పాటే అతని సోదరుడు ధవళాంగుడనే వానిని కూడా ఆ దేశానికి పంపిద్దాము"



(ఇంతలో ప్రతీహారి ఒకడు ప్రవేశించి)

"దేవరవారిని చూచుట కొరకై జంబూద్వీపపు చిలుక యొక్కటి సింహద్వారము కడ నిలుచున్నది తమ సెలవైనచో ఆ శుకవర్యుని లోనికి ప్రవేశపెట్టెదను"



హిరణ్యగర్భుడు సాభిప్రాయంగా - మంత్రి వంకే పరికించాడు

"గౌరవపురస్సరముగా చిలుకను అతిథిగృహమున వుచితాసనమున కూర్చున బెట్టుము ద్వారపాలకా!"




"మా ప్రభువిప్పుడు మహామంత్రితో - మంతన మాడుతు వున్నారు. వారిటు వచ్చే వరకూ యిక్కడ నిరీక్షించుచూ కూర్చొనుము."





పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త :- విశ్వాత్ముల నరసింహమూర్తి



అరుణముఖుడు
అటులేయని -
అక్కడనే
కూర్చుండెను



హిరణ్యగర్భుడు (మంత్రితో)
"ఆహా! యుద్ధము సమీపించినది. -
ధైర్యం, శౌర్యం కలిగిన వీరుల - కింత
కంటె వేరేమి కావలెను? - అమాత్య
వర్యా! వేగంగా మన-సేనలన్నిటిని
సిద్ధము చేయుడు - సేనాపతి కొక
కబురంపించుడు!"



"దేవర పలుకులు శిరోధార్యములు - అయినా
నాదొక మాట వినండి - చతుర్విధములగు
ఉపాయములలో - కడపటిదే కద దండో
పాయం - తొందరపడినచో ఏమగునో
యని - మది సందేహము కలుగుచున్నది. -
శత్రువు బలవంతుని వలె తోచును -
ఇప్పుడు మనమొక దుర్గమ దుర్గము - కట్టుకొ
నుట ముఖ్యావశ్యకము."



"నీవన్నది నిజమేనోయి సుమా!
కాలయాపనము సేయక వేగమె
దుర్గ శిల్పులను ఆహ్వానించుము!"



అమాత్యుడప్పుడు
మహా శిల్పియగు -
వీరవరుడనే
బెగ్గురు పక్షిని -
ఆస్థానమునకు
పిలిపించాడు.

"సారసవరుడా! నీతో యిప్పుడు - ముఖ్య
మైన పని కలిగినది - దానికి నీవే
తగినవాడవు - అతి శీఘ్రంగా, దుర్భే
ద్యంగా - మనకొక దుర్గం అవసర
మైనది - నీ నైపుణ్యం చూపించుటకిదె
చక్కని తరుణము వచ్చినది."



"నాపై దయతో అమాత్యవర్యులు
కార్యభారమును మోపిరి గానీ
అంత సమర్థుడ కాను ప్రభూ!"



"ఈ మాటలకేమి గాని, - నీవె తగిన
వాడవనుచు - మహామంత్రి చెప్పినారు
- సాధ్యమో, అసాధ్యమో - నీపై ఈ పని
పెట్టితి. - వేగమె మాకొక దుర్గం -
నిర్మించుట నీ బాధ్యత!"



ప్రభువాజ్ఞను విని
బెగ్గురు పక్షి -
ఎట్లీ కార్యము
నెరవేర్చుటయని -
విచారించుచూ
వెలుపలికేగెను.

... ...

కొంతసేపటికి బెగ్గురుపక్షి -
తిరిగివచ్చి యిట్లన్నాడు

"అదృష్ట వశాత్తు నగరం వెలుపల
పాడుబడిన ఒక దుర్గం చూచితి
దానిని బాగొనరించినచో మన
కన్నివిధాలా సరిపోతుంది!"



హిరణ్యగర్భుడు సంతో
షించి - బెగ్గురు పక్షిని
కౌగలించుకుని ఆ -
దుర్గాధ్యక్షత కూడా
అతనికే - అప్పగించి
పంపించాడు



చిత్రవర్ణునితో
యుద్ధము చేయగ -
సంబరపడుతూ
హిరణ్యగర్భుడు -
సన్నాహములను
చేస్తున్నాడని -
ఆచార్యుడు
విష్ణుశర్మ -
రాకొమరుల
కింతవరకు -
గాథ చెప్పి ఇట్లనెను

"ఇంతదనుక నడచిన కథ
విగ్రహమను తంత్రమందు
మొదటి భాగమని ఎరుగుడు"

"బాగున్నది గురుదేవా! -
ఆపిమ్మట ఏమైనదో
త్వరగా సెలవీయండి."






# పేరాస

"రవి"



ఒక్కనాడు
నక్కబావ
నీటికొరకు
యేటిదరికి
యేగివొక్క
గజరాజును
కాంచియిట్లు
తలపోసెను
తన మదిలో:
"దీన్ని చంపి
తే మనకు
నెలరోజుల
గ్రాస"మనుచు
దొండతీగ
దోసతీగ
తెచ్చి త్రోవ
కడ్డముగా
కట్టి ప్రక్క
పొదలోన
పొంచి పొంచి
కూర్చున్నది.
గజరాజు
యీ విషయం
గమనించి
యెరుగనట్లు
తీగలలో
కాళ్లు దూర్చి
తేం గ్రుడ్లు
వైచింది.
పొంచివున్న
నక్కబావ
గజరాజు
చచ్చెననుచు
చంకలెగుర
వేసికొనుచు
యిరుగు నక్క
లకు విందు
పొరుగు నక్క
లకు పొందని
తన వారి
నందరను
విందునకు
పిలిచింది.
నక్కలన్ని
గజరాజును
పట్టిచూచి
పైభాగం
కొరకరాని
కొయ్యగాను
వున్నదనుచు
క్రిందిభాగ
మేమైనా
క్రుళ్లి మెత్త
బడవచ్చని
ముట్టెలతో
గజరాజును
పైకి నెత్త
సాగాయి.
గజరాజు
మెల్లమెల్లగ
వొత్తిగిల్లి
పొట్టక్రింద
కన్నింటిని
చేరనిచ్చి
పారజూచి
పొర్లి గింత
వేసింది.

గజరాజు
పొట్టక్రింద
పడ్డనక్క
లన్ని గూడ
విలవిలమని
తన్నుకొనుచు
ప్రాణాలను
వదిలాయి.
పేరాస
యెప్పుడైనా
ప్రాణాలను
తీస్తుంది.



అద్దెబోటులో—

# ముచ్చటగా ముగ్గురు

## (కుక్క సంగతి సరే సరి!)

### 13

‘మార్లో’లో మరునాడు వుదయం మేము నలుగురమూ చాలా పెందలకడే నిద్దర లేచాం. లేచీ లేవగానే నదిలో స్నానాలకు వెళ్ళాం. తిరిగి వస్తుండగా మా కుక్క మాంట్ మొరన్సీ అడ్డ గాడిదలా ప్రవర్తించింది. నాకూ, నా కుక్కకీ ఏ విషయం లోనూ అభిప్రాయభేదం రాదు కానీ, ఒక్క పిల్లుల విషయంలోనే వల్లమాలిన తగాదా తప్పటం లేదు. నాకు పిల్లులంటే తగని యిష్టం· దానికి గిట్టవు.

నాకు పిల్లి ఎదురైనప్పుడల్లా దాన్ని ఎత్తుకు ముద్దాడా లనిపిస్తుంది. “పుస్...పుస్” అని పిలుస్తాను. నేను పిలిచినప్పుడు ఎంతలావు పిల్లి అయినాసరే, యిట్టే నాదగ్గిరికి తోక ఆడించుకొంటూ వచ్చి నిలబడుతుంది. విల్లంబులా నడుం వొంచి నాపాంటుకి తనవీపు పడేసి రుద్దుతుంది. నాకూ పిల్లులికీ యింత మంచి స్నేహానుబంధాలు వుంటాయి. ‘మాంట్ మొరన్సీ’తో అల్లా కాదు. దానికి పిల్లి ఎదురైందంటే చాలు— ఆ వీధి వీధి అంతా మోగిపోతుంది.

నదిలో స్నానంచేసి పెద్దబజారులోనుంచి వస్తుండగా పక్కషాపుల్లో ఎక్కణ్ణుంచో గండుపిల్లి ఒకటి రోడ్డుమీదికి వూడిపడి మావైపుకే మందగమనంతో వస్తూవుంది. దాన్ని చూడగానే మాంట్ మొరన్సీ అరివీరభయంకరంగా మొరిగేసింది.

మాంట్ మొరన్సీపాలబడిన పిల్లి మామూలు పిల్లి కాదు బాగా పెద్ద సైజుది అంతపెద్ద పిల్లిని నే నింతవరకు చూడలేదు. దాని రూపురేఖా విలాసాల్లో కూడా ఏదో విచిత్రం తోచింది. తోక సగమే వుంది. మిగిలిన సగం ఎప్పుడో కత్తిరించుకుపోయినట్లుంది. చెవి ఒక్కటే వుంది. ముక్కులో సగంభాగమే సరిగా వుంది. మిగిలిన సగం ఏమైందో తెలియదు. దానివాలకమూ, దాని చూపూ నాకే చాలా భయంకరంగా తోచాయి.

ఆ పిల్లి అవుపించగానే గంటకి యిరవైమైళ్ళ వేగంతో ముందుకి చొచ్చుకుపోయిన మాంట్ మొరన్సీ, తా నంత భయంకరంగా విరుచుకు పడుతున్నా, ప్రత్యర్థి కలతచెందకపోవటం చూసి, తానే ‘స్పీడు’ తగ్గించేసుకొంది. ఈ కుక్క యింత హడావుడి చేస్తున్నా, ఆ పిల్లి మాత్రం నదురూ బెదురూ లేకుండా రోడ్డు నట్టనడానికి వచ్చి, కదలకుండా కూర్చుని ‘ఏమిటి విశేషం’ అన్నట్లు కుక్కకేసి తీక్షణంగా చూసింది. ఆ చూపుకే మా కుక్క హడిలిపోయి తోక ముడిచేసింది

ఆ పిల్లి చూపులో ఎంత శక్తి వున్నదో కాని,

మూలం
జెరోమ్ కె. జెరోమ్

అనువాదం :
విశ్వాత్ముల నరసింహమూర్తి

#  ముచ్చటగా ముగ్గురు 

మా మాంట్ మొరన్సీ యిప్పటికీ పిల్లి పేరు విన్నప్పుడల్లా ఒక మూలకి పోయి ముడుచుకుని పడుకుంటుంది.

ఆరోజు స్నానాలు పూర్తిచేసుకొని ప్రొద్దుటి ఫలహారాలు ఆరగించాక, బజారులోకి వెళ్ళి కూరలూ అవీ కొనుక్కొందా మనుకొన్నాం. మరొక మూడు రోజులకైనా సరిపోయే కూరలు కొనాలని నిశ్చయించుకొన్న మీదట, ఆకుకూరలు కొందామనీ, అవైతే ఆరోగ్యానికి చాలా మంచిదనీ జార్జి అన్నాడు. అంతేకాక ఆకుకూరలైతే వండటం చాలా తేలిక అనీ, ఆ పని మాకెవ్వరికీ శ్రమ లేకుండా తాను చేసెయ్యగలననీ కూడా అన్నాడు.

పది పౌనుల బంగాళాదుంపలు, బుట్టెడు పచ్చిబఠానీగింజలు, నాలుగైదు కాబేజీ గడ్డలు, కొద్దిగా మసాలా దినుసులూ, మాంసాహారం, కాసిని పళ్ళూ, కొన్ని రొట్టెలు, వెన్న, బెల్లంపాకం, కోడిగుడ్లు వగైరా సామాను అంతా కొన్నాం.

వీటి నన్నిటినీ, 'మార్లో' బజారులో కొని పడవలరేవుకి చేరవేసిన ఆనాటి అనుభవం నేను ఏనాటికీ మరువలేను మేమూ వూరిని విడిచి వెళ్లడం అనేది అత్యంత వైభవోపేతంగా జరిగింది మేము ఏ వస్తువు కొన్నా, కొనబోయే ముందే అంగడివాడితో చెప్పే వాళ్లం —మేము కొన్న సరుకు నంతటినీ అప్పటి కప్పుడు పొట్లాలు కట్టి, బుట్టల్లో పెట్టి వాళ్ల షాపు కుర్రాళ్ల చేత మా వెంట పంపించితీరాలని మేము అలా పట్టుపట్టటంలో అర్థం లేకపోలేదు. మామూలుగా యీ అంగళ్ళవాళ్లు ఏం చేస్తారంటే, ముందు మనదగ్గిర డబ్బు పుచ్చేసుకొని, సరుకు మన వెనకాలే పంపిస్తా మంటారు. ఎంతకీ పంపించరు. మళ్లీ వెనక్కి వెళ్లి కంఠనాళాలు బద్దలైపోయేలా వాళ్లతో పోట్లాట వేసుకొంటే గాని, మనం చెల్లించిన సొమ్ముకి వస్తువు మన చేతుల్లోకి వూడిపడదు. అందుకని ప్రతి అంగట్లోనూ సామాను అంతా పొట్లాలుగా కట్టి కుర్రాడు నెత్తి కెత్తుకొనేదాక అలా కనిపెట్టుకు కూర్చున్నాం.

మొత్తానికి మాకు కావలసిన సరుకులు అన్నీ కొనటం పూర్తి అయ్యేసరికి సామాన్లు మోసుకొని వచ్చే కుర్రాళ్ళూ, మేమూ కలిసి పెద్ద వూరేగింపులా తయారయ్యాం రోడ్డుమీద మేము నడిచిన వరస కూడా చిత్రంగా వుంది.

అందరికంటే ముందు, బాతిక నములుతూ మాంట్ మొరన్సీ నడిచింది.

దాని వెనక—దాంతో కొత్తగా స్నేహం చేసిన రెండు కుక్కలు

వాటి వెనకాల—చిన్న పైపు కాలుస్తూ, కోట్లూ, గొంగళ్ళూ మోసుకొస్తున్న జార్జి.

వాడి వెనకాల—హారిస్సు లోపల కుక్కిన సామాను ఎక్కువకాగా పిగిలిపోవటానికి సిద్ధంగావున్న చేతిసంచీ నొకదాన్ని మోయలేక మోస్తూ, పైకి ఆ విషయం తెలిసిపోకుండా వుంచాలని తప్పటడుగులు వేస్తున్నాడు. రెండోచేత్తో నిమ్మరసం సీసా పట్టుకొస్తున్నాడు.

వాడి వెనకాల—కూరలకొట్టు కుర్రాడు, వాడిపక్కని రొట్టెలఅంగడి కుర్రాడు, ఇద్దరూ చెరొక బుట్టా నెత్తిని పెట్టుకొన్నారు

గోనెసంచి మోసుకొస్తున్న మరొక కూలివాడు వాళ్ళ వెనక వస్తున్నాడు.

పిప్పరమెంట్ల కొట్టులో పనిచేసే కుర్రాడు, బుట్ట పట్టుకొని ఆ వెనకాల నడుస్తున్నాడు

అపరాల అంగడి కుర్రాడు వాడి వెనకాల.

వీడి వెనక ఒక బొచ్చుకుక్క !

దాని వెనక జున్ను అంగడి కుర్రాడు.

వాడి వెనక చేతిసంచి మోసుకొస్తున్న ఒక ముసలాడు.

ముసలాడి వెనకాల వాడి ప్రాణస్నేహితులైన మరొక యిద్దరు ముసలాళ్లు.

పళ్ళ అంగడి కుర్రాడు

వాడి వెనకాల ,నేను! నా చేతుల్లో మూడు టోపీలు, ఒక జత జోళ్లు ఉన్నాయి ఇవన్నీ చేతుల్లో మోసుకొస్తున్నందుకు నాకు లోలోపల చెడ్డ సిగ్గుగా వున్నప్పటికీ పైకి మాత్రం నా చేతుల్లో ఏమున్నదీ నాకే తెలియనట్లు కనిపించాలని నా ప్రయత్నం.

నా వెనకాల వుబుసుపోని కుర్రకుంకలు అరడజను మంది వాళ్ళతోపాటు నాలుగు వీధికుక్కలు,

వినోదంగా వుల్లాసంగా నడుస్తూ మా వెంటనే వచ్చారు.

ఇంతటి పరివారంతో మేము పడవలరేవుకి చేరాం. అక్కడ పడవలకి కాపలా వుండేవాడికి మా పడవ ఏదో వెంటనే బోధపడక 'తమరిది స్టీము లాంచా? గూడు పడవా?' అని అడిగాడు

మాది మామూలుగా రెండువైపులా తెడ్లు వేసి నడిపించే పడవ అని చెప్పితే వాడు ఎందుకనో చాలా ఆశ్చర్యపోయాడు.

అప్పుడేవో పండగ రోజులు. అంచేత నదిలో ఎక్కడ చూచినా డజన్లకొద్దీ స్టీమ్ లాంచీలు అడ్డ దిడ్డంగా పరుగెత్తుతున్నాయి ఆరోజు వుదయం స్టీమ్ లాంచీలు మమ్మల్ని ఏడ్పించి వదిలిపెట్టాయి.

అసలు యీ స్టీమ్‌లాంచీ లనేవి వున్నాయే— వాటిఅంత పాపిష్టివి అవే కాని మరేవీ లేవు వాటిని చూస్తేనే చాలు నాలో వున్న పాశవిక ప్రకృతి ఏదో పైకి వస్తుంది. ఇప్పుడు అంటే యిలా ఎంత అసహ్యమైనా చచ్చినట్టు మనలో మనమే మింగి వూరుకొంటున్నాం కాని, నాగరకత యింతగా బలిసిపోని ఆ వెనుకటి రోజుల్లో అయితే, ఒకడికి యింకొకడి వాలకం గిట్టకుండాపోవటం అంటూ జరిగితే, వాణ్ణి వీడు వెంటనే సఫాచేసిపారేసేవాడు అటువంటి పరిస్థితే యిప్పుడూ వుంటే, నేను తప్పకుండా యీ స్టీమ్ లాంచీ లనేవి యిక పుట్టకుండా సర్వనాశనం చేసి పారేసేవాణ్ణి. వెధవ స్టీమ్‌లాంచ్!—దాని రొద, దాని వాలకం అబ్బ! పైగా పెద్దలార్డులాగా ఆ వెధవ 'విజిల్' ఒకటి! అడ్డువచ్చిన ప్రతి చిన్నబోటునీ 'తప్పుకో వోయ్ వెధవాయ్' అన్నట్లుంటుంది.

నేను చెప్పుకోవటం మొదలుపెడితే మీారు స్వోత్కర్ష అనుకొంటారేమో కాని, ఆ ఒక్క వారం రోజుల్లోనూ యింతలావు స్టీమ్‌లాంచీలనీ మేము ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించామంటే నమ్మండి. చిన్న దొన్నెలాంటి మా పడవ ఒక్కదానితో అన్ని వందల స్టీమ్‌లాంచీలనీ ఆట ఆడించేశాం!

ఏం చేశేవాళ్ళమంటే—మా పడవ నదికి ఒక పక్కగా పోతూ పోతూవుండగా మా ముగ్గురిలో ఎవడికో ఒకడికి ఇంతదూరంలో ఒక స్టీమ్‌లాంచ్ పొడగట్టేది. "స్టీమ్‌లాంచి ఏదో వస్తోందిరోయ్!" అని వాడు మిగిలిన యిద్దరినీ హెచ్చరించేవాడు. అంతే— చుక్కాని వదిలేసి ముగ్గురమూ లాంచ్ వస్తున్నవైపుకి మా వీపులు పెట్టి కూర్చునేవాళ్ళం. మా పడవ నది నట్టనడానికి కొట్టుకుపోయేది.

ఈలోగా, అంతదూరంనుంచే వెధవ 'విజిల్' ఒకటి వేసుకొంటూ, స్టీమ్‌లాంచ్ దగ్గరకు వచ్చేది అవతల అది ఎంత గీపెట్టి అరిచి చచ్చినా మేము వినిపించుకొనేవాళ్ళం కాదు విజిల్ వేసి వేసి విసిగిపోయి లాంచ్ డ్రైవరూ, అందులో వుండే ప్రయాణీకులూ అందరూ కిటికీల్లోనుంచీ తలలు బయటికిపెట్టి చప్పట్లు చరిచి, గావుకేకలు పెట్టి నానాహంగామా చేసేవాళ్లు. అయినా మేము వినిపించుకొనేవాళ్లం కాదు. సరిగ్గా ఆ సమయానికే మా హారిస్సు, వాడి బామ్మ చాదస్తాన్నిగూర్చిన చిత్ర విచిత్రమైన వుదంతాలు చెప్పతుండేవాడు. ఆ కబుర్లలో పడి ముగ్గురమూ మిగిలిన సృష్టిలో ఏ ఒక్కదాన్నీ పట్టించుకోలేని స్థితిలో వుండేవాళ్ళం

ఏవిధంగానూ మా దృష్టిని ఆకర్షించలేక, స్టీమ్ లాంచీ డ్రైవర్, 'బాయిలర్' బద్దలైపోయేలా పెద్ద పెట్టున విజిల్ వేయించి, యింజన్ వెనక్కి నడిపించి, లాంచిని ఒడ్డుమీాదికి ఎక్కించేసేవాడు. దాంతో లాంచిలోని ప్రయాణీకులూ, ఒడ్డుమీాది మనుష్యులూ అందరూ పోగడిపోయి పెద్దపెట్టున కేకలు పెట్టేవారు. ఈ గందరగోళం అంతా చూసి, దూరంగా పోతున్న పడవలు లాంచీలు అన్నీ అక్కడికి రావడము, వాటిలోని మనుష్యులు కూడా వీళ్ళతో శృతి కలిపి అరవటమూ జరిగేది కొన్ని మైళ్లు ఎగువకి, కొన్ని మైళ్ళు దిగువకీ మొత్తానికి నది నదిఅంతా కేకలతో నిండిపోయేది అప్పటికి హారిస్సు, మంచి పట్టులోకి వచ్చిన కథను చెప్పటం మానేసి కలతనిద్దరలో వులిక్కిపడ్డట్లు, "ఎక్కడో స్టీమ్‌లాంచ్ అరుస్తున్నట్లున్నదిరా? మళ్ళీ విను, శ్రద్ధగా" అని మమ్మల్ని హెచ్చరించేవాడు.

"అవునురా! ఇందాక నేనుకూడా విన్నాను— స్టీమ్‌లాంచ్ కూతలాగా వుంది!" అనేవాడు జార్జి

దాంతో ముగ్గురమూ కంగారుగా లేచిపోయి ఏం చేయటానికీ తోచనట్లు తికమకపడిపోయేవాళ్లం. మేము పడుతున్న కంగారంతా చూసి, సరిచేయాలని

# ★ ముచ్చటగా ముగ్గురు ★

అవతల స్టీమ్‌లాంచ్‌లోని మనుష్యులు తల కొక రకంగా సలహాలు యిచ్చి, మా పడవని కాస్సేపు అటు తిప్పమనీ, కాస్సేపు యిటు తిప్పమనీ, మరి కొంతసేపు ఎటూ తిప్పవద్దని పూదర పెట్టేవాళ్లు. మేము కావాలని, వాళ్ళు అటు తిప్పమన్నప్పుడు యిటు తిప్పి, యిటు తిప్పమన్నప్పుడు అటు తిప్పి, వాళ్ళని యింకా కంగారులో పెట్టేసేవాళ్ళం. చివరికి యిలా లాభం లేదని లాంచీతాలూకు మనుష్యులే చిన్న పడవ ఒకటి వేసుకొనివచ్చి వాళ్లే కొంతదూరం మా పడవని నడిపించి పెట్టేవాళ్ళు. వారావిధంగా చేసిన సహాయానికి కృతజ్ఞత వెల్లడిస్తూ, మా పడవని కొంత దూరందాకా వాళ్ల లాంచీకి కట్టేసుకు నడిపించమని బతిమలాడేవాళ్లం. వాళ్ళు అవేమీ వినిపించుకోకుండా ధుమధుమలాడుతూ పోయేవాళ్ళు.

నదిమీది ప్రయాణాలకి అంతగా అలవాటు పడని ముసలమ్మకి స్టీమ్‌లాంచీలను చూస్తే మరీ భయం. ఇదివరలో ఒకసారి ముగ్గురు ముసలమ్మలు వున్న జట్టుతో కలిసి నేను నదిమీద ప్రయాణంచేసిన సందర్భం ఒకటి నాకు యీనాటికీ బాగా జ్ఞాపకం వుంది. ఆ ప్రయాణంలో స్టీమ్‌లాంచ్ అనేది ఎదురైనప్పుడల్లా, ఆ ముగ్గురు ముసలమ్మలూ పడవని ఒడ్డుకుచేర్చమని పంతం పట్టేవాళ్లు. లాంచ్ సాంతం కనిపించకుండా పోయేదాకా ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ఒడ్డుమీద కూర్చునేవాళ్లు 'ఇంత కంగారు పడిపోతా రెందుకు'అని ఎవరైనా అడిగితే, క్షేమంగా తిరిగివస్తామని తమ కుటుంబాలలోనివారందరికీ మాట యిచ్చి వచ్చినందువల్ల తాము యింత జాగ్రత్తగా వుంటున్నామని సమాధానం చెప్పేవాళ్లు

'హాంబుల్ డెన్ లాకు'దగ్గరకి వచ్చేసరికి మా కూజాలో మంచినీళ్లు అయిపోయాయి అక్కడ పడవ ఆపి, లాకుదగ్గిర కాపలావుండే మనిషి యింటికి వెళ్లాం, కాసిని మంచినీళ్లు అడిగి తెచ్చుకొందామని.

మా ముగ్గురితరఫునా జార్జే మాట్లాడాడు— ముందుగా సమ్మోహనాస్త్రం లాంటి మందహాసం ఒకటి పారేసి, "కాసిని నీళ్లు వుంటే యిస్తారా?" అని.

"ఓ, తప్పకుండా! మీకు ఎన్ని కావాలో అన్నీ పట్టుకెళ్లి, మిగిలింది అక్కడే వదిలేసెయ్యండి' అన్నాడు లాకుకి కాపలాకాసే ఆ ముసలాడు

"అంతా పట్టుకుపోతామా? ఎంత మాట' ఇంతకీ ఎక్కడా?" అన్నాడు జార్జి, మంచినీటి కుండ కోసం నాలుగుమూలలా కళ్లతో వెతుకుతూ.

"ఎప్పుడూ ఎక్కడ వుంటుందో, యిప్పుడూ అక్కడే వుంది! సరిగ్గా మీ వెనకాలే వుంది"అన్నాడు ముసలాడు, ముసిముసినవ్వులు నవ్వుతూ.

జార్జిగాడు గిరుక్కున వెనక్కి తిరిగి అంత వెతికాడు ఎక్కడా కనిపించకపోగా "ఏదీ—నాకేమీ కనిపించడంలేదే?" అన్నాడు.

"ఏం పాపం? కళ్లు లేవా?" ముసలాడి వ్యాఖ్యానం. జార్జి మాత్రం నిలబడినచోట నిలబడకుండా, కుండకోసం వెనక్కి తిరిగిచూస్తూ గిరగిరా గింగిరాలు తిరుగుతున్నాడు.

చివరికెప్పటికో ముసలాడు వేలెత్తి నదికేసి చూపించి "అదేమిటయ్యా! అన్ని నీళ్లు వుంటే కనిపించటంలేదంటావేం?"అన్నాడు

"అదా!...అబ్బే. మాకు తాగటానికి మంచి నీళ్లు కావాలి నది మాకు సరిపడదు"అన్నాడు జార్జి.

"నదిఅంతా తాగెయ్యకుండా, కొంచెం కొంచెం నీళ్లు తీసుకు తాగితే ఏమీ చెయ్యదు. ఇప్పటికి పదిహేనేళ్లుగా నేనాపని చేస్తున్నాను. ఇంతవరకు నాకు ఏమీ చెరుపు చెయ్యలేదే!" అన్నాడు ముసలాడు.

పదిహేనేళ్ల పాటు యీనీళ్లు తాగినంతమాత్రం చేత అదేదోదివ్యౌషధమైనట్లు అందరికీ అదే సిఫార్సు చేయనక్కరలేదనీ, అధవా అలా సిఫార్సుచేసినా పూచికపుల్లలా వున్న వీణ్ణి చూసినవాళ్లెవ్వరూ వీడి మాటలకి మోసపోరనీ, ఆ ముసలాణ్ణి పట్టుకొని జార్జి నానామాటలు అనేశాడు. ఇక వాడితో పెట్టుకొంటే లాభం లేదని, యింకొక పాకకి వెళ్ళి అడిగాం వాళ్లు కాసిని నీళ్లు యిచ్చారు. వాళ్లు యిచ్చినవి నదినీళ్లే నని మాకు తెలియకపోయినా, యిప్పుడు ఘంటాపధంగా చెప్పగలను. అప్పుడు తెలియలేదు కాబట్టి ఆ నీళ్లు

మాకేం చెయ్యలేదు. దోషం అనేది కంటికి కనిపించకపోతే, కడుపుకీ ఏమీ చెయ్యదు.

అయినా నది నీళ్లు ఎందుకు పడవో చూద్దామని ఆతరువాత ఒకసారి ప్రయత్నం చేశాం. ప్రయోజనం ఆట్టే లేకపోయింది. 'విండసర్'దగ్గిర ఏటివాలులో మా పడవ ప్రయాణంచేస్తూవుండగా, మా కూజాలో నీళ్లు అయిపోయాయి. టీ కాచుకోవటానికి నీళ్లు అర్జంటుగా కావలసివచ్చాయి. నది నీళ్లు తప్ప వేరేగతి లేదు. ఎంత నది నీళ్లుఅయినా మరగకాచితే వాటిలో వుండే దోషం పోతుందనీ, ఆవిధంగా చేస్తే నదీజలాలలో వుండే రోగక్రిములన్నీ మాఁమాఁ మాడి చచ్చిపోతాయనీ హారిస్సు అన్నాడు. ఆ ధైర్యంతో కెటిల్ నిండా నదీజలం పట్టి స్టౌమీద పెట్టాం. నీళ్లు నిజంగా మరగ కాగే దాకా దానివంక శ్రద్ధగా చూస్తూ కూర్చున్నాం.

టీ తయారుచేసుకొని తాగబోతున్నాం. కప్పు ఎత్తి తాగబోతున్న జార్జి అకస్మాత్తుగా ఆగిపోయి "అదేమిటి?" అని అడిగాడు.

"ఏది ఏమిటి?" అని నేనూ, హారిస్సు వాణ్ణి రెట్టించి అడిగాం.

"అదుగో అది!" అంటూ పడమటివైపుకి వేలితో చూపించాడు.

వాడు చూపించినవైపుకి నేనూ, హారిస్సూ చూశాం. నదీప్రవాహంలో సోమరిపోతు కుక్క ఏదో కొట్టుకువస్తున్నది. నిజానికి అంతగా మనస్సు నిలకడగల

(55-వ పేజీ చూడండి)



భువనేశ్వరాలయంలోని గణేశుడు

# సుశీల

సుశీల నిజంగా సుశీలే చాల తెలివిగల పిల్ల అందుకే యింట్లోనూ బయటాకూడా అందరి వద్దా మన్ననలు పొందుతూండేది పంతులు రామారావుకూడా సుశీలంటే ప్రాణం వదిలేవాడు. తండ్రి పరంధామయ్య సుశీలకు కావలసినన్ని ఆటబొమ్మలు, మిఠాయిలు తెచ్చి యిస్తూండేవాడు. అప్పుడప్పుడు బేడా, పావలా చిల్లర కూడా యిస్తూండేవాడు అక్కా బావావాళ్లుసైతం పండుగలకొచ్చి తిరిగి వెళ్లేటప్పుడు సుశీలచేతిలో యింత చిల్లర పడేసి వెళ్లేవారు.

సుశీల యిష్టంవచ్చినట్టు అనవసరంగా డబ్బులుఖర్చుపెట్టేదిగాదు. తనకు దొరికిన డబ్బులు బరిణెలో వేసి అలమరులో పెట్టేది కానీ సమయం కనిపెట్టి సుశీలఅన్న గోపీ యీడబ్బు కాస్తా కాజేసి కూర్చునేవాడు. గోపీ గొడవ పడలేక అప్పుడప్పుడూ యీ డబ్బులు లేకున్నా బాపుండేదనుకునేది సుశీల యీ సంగతి అమ్మ నాన్నకు చెప్పినట్లయితే వారు గోపీని వీపు పగలేస్తారని వారితో సైతం చెప్పేదికాదు కానీ దొరికిన డబ్బులు గోపీకంటపడకుండా ఎలాగ ఎత్తిపెట్టడం? అని యోచించి తుదకొక ఉపాయం ఆలోచించింది

స్టోర్ రూమ్‌లో బియ్యపు బస్తాలు పడేసివున్నాయి ఆ బస్తాల సందుల్లో పెట్టె దాచేస్తే గోపీ కనుక్కోలేడని తలచింది ఆనాటి నుండి దొరకిన డబ్బంతా చిన్న పెట్టెలోపెట్టి అది ఆ బస్తాల సందులో దాచేది ఇలాగే డబ్బు పొదుపుచేసింది కొద్దిరోజులకు తొమ్మిది రూపాయలు చేరింది.

గోపీకి యీ మధ్య చిల్లర బొత్తిగా దొరకడంలేదు. సుశీల డబ్బు లెక్కడపెడుతోందో నని యిల్లంతా తెగగాలించాడు కానీ ఆచూకీ దొరకలేదు. వెదకి వెదకి

శ్రీ యస్. గోపాలరెడ్డి

వేసారి యిక తనకు డబ్బులు దొరకవని నిశ్చయించుకొని, దిగాలుగా హాల్లో కూర్చుని సుశీలను తిట్టడం మొదలెట్టాడు ఆ సమయంలో ఓ చిట్టెలుక హాలునుండి సామానుల గదిలోకి పరుగుతీసింది. గోపీ దాన్ని తరుముకొని గదిలో కెళ్లాడు ఎలుక తుర్రుమని బస్తాల సందుకెళ్లింది గోపీకూడా బస్తాల పైకెక్కి తెగవెదికాడు ఎలుక కనబడలేదు గానీ, సుశీల డబ్బులపెట్టె మాత్రంకనబడింది గోపీహృదయం సంతోషంతో ఉప్పొంగి పోయింది యిటు అటు చూస్తూ, ఉన్న డబ్బు కాస్తా కాజేసి తుర్రుమన్నాడు.

గోపీ స్టోర్‌రూమునుండి పరుగెత్తడం సుశీల చూచింది కడుపున గంపెడు అగ్గిపడ్డట్టయింది వెంటనే వెళ్ళి బస్తాలసందున చూచింది. పెట్టెమాత్ర ముందిగానీ చిల్లర లేదు. సుశీలకు ఒక్కమారుగా దుఃఖం పొంగివచ్చింది. ఒక్క పరుగున వెళ్లి అమ్మకు చెప్పాలనుకొంది. కానీ నిన్న గోపీని అమ్మ కొట్టడం గుర్తు కొచ్చేసరికి ఆ ప్రయత్నం మానుకొంది. ఒకటా, రెండా? తొమ్మిది రూపాయలు కాజేశాడు ఎలాగైనా వాడికి బుద్ధిచెప్పాలని నిశ్చయించుకుంది కానీ యెలా బుద్ధి చెప్పడం? ఎంతో యోచించి యోచించి తుదకొక నిశ్చయాని కొచ్చింది

గోపీ జల్సాగా మేటినీషో కెళ్ళి సాయంత్రం ఆరుగంటలకు యింటి కొచ్చాడు. గోపీ రావడంతోటే దగ్గరికెళ్ళి "ఒరే అన్నాయ్! నేనొక లెక్క అడుగుతా చెప్తావా?" అంది

"ఏమి లెక్కో చెప్పు మరి యిట్టే చెప్పేస్తా" నన్నాడు గోపి

"నేనొకచోట డబ్బు దాచాను. దాని మొత్తం కాస్తలెక్క తప్పింది అది వరుసగా కూడి చెప్పాలి" అంది సుశీల

ఈ మాట వినేసరికి గోపీ గుండెలు ఓ మారు పీచు పీచుమన్నాయి కాని ధైర్యం తెచ్చుకొని "చెప్పూ మరి" అన్నాడు

సుశీల చెప్పడం ప్రారంభించింది "నా పెట్టెలో ఓమారు



గోపీ స్టోర్ రూమ్‌నుండి పరుగెత్తడం సుశీల చూచింది

రెండు రూపాయలు, మరియొక మారు ఒకటిన్నర వేశాను. ఇంకొక మారు రెండుంపావలా వేశాను మరియొకమారు ఒకటింబావలా వేశా. నిన్న రెండు రూపాయలు పడేశాను. మొత్త మెంతయినట్టు చెప్పు చూదాం".

గోపీ బెదురు చూపుల్తో దిక్కులు చూస్తూ "తొమ్మిది" అన్నాడు మెల్లగా.

"సరేగాని యిప్పుడు ఆ పెట్టెలో ఐదురూపాయలు వేయబోతాను అప్పు డెంతవుతుందో చెప్పు".

"అప్పుడు మొత్తం పదునాలు గౌతుంది".

"సరి యిప్పుడా అయిదూవేస్తే పదునాలు గౌతుంది. సిల్కుపావడకు సరిపోతుంది "అని గొణుక్కుంటూ వంటగదివైపు, వెళ్లిందిసుశీల.

గోపీకి తిక్క పట్టినంత పనయింది. తెగ యోచించాడు. "పెట్టెలో తొమ్మిదే అవేమో ఉన్నాయి కాజేశాను యిప్పుడు సుశీల అయిదు వేయబోతుందట. తీరా అయిదూ తీసుకెళ్ళి పెట్టె తెరచి చూస్తే దానిలో అంతకుముందు తొమ్మిదీ కనిపించకపోతే అయిదు తిరిగి వేస్తుందా? ఛీ! పొరబాటు చేశాను. యీనాడంతా ఆ డబ్బు అలాగే ఉంచి, రేపు తీసుకెళ్లుంటే తొమ్మిదీ ఐదూ చేరి పదునాలుగు వచ్చి ఉండేవి. కానీ యిప్పుడు మాత్రమేం పోయింది. నే నెత్తుకొన్న రూపాయలలో ఓరూపాయి ఖర్చయిపోయింది మిగిలిన ఎనిమిదీ వున్నాయ్. ఇప్పుడు ఒక్క రూపాయీ సరిపెట్టి తొమ్మిదీ ఆ పెట్టెలో పడేస్తే, రేపు తెల్లారి సరికే పదునాలుగు అక్కడే పడ్తాయి."

అని యోచించి, ఓ పరుగు వెళ్లి పక్కింటి రామును బతిమాలి, ఒక రూపాయి అప్పు తెచ్చి, సుశీల లేని సమయం కనిపెట్టి, ఆ తొమ్మిది రూపాయలూ పెట్టెలో పడేశాడు.

అందరూ పడుకొనే సమయంలో సుశీల బస్తాసందులో చూచింది పెట్టెలోడబ్బులు పెట్టెలోనే వున్నాయి తన వుపాయం పారిందనుకొని పెట్టె తీసి జాగా మార్చి దాచింది. వెళ్ళి పడుకొని నిశ్చింతగా నిదరపోయింది గోపీ రాత్రంతా పదునాలుగు రూపాయలగురించి తియ్యని కలలు కన్నాడు. తెల్లారింది గోపీ పరుగున వెళ్ళి బస్తాలసందులో చూచాడు. బిక్కమొగం వేశాడు.

# అందయ్యాదొంగలే

ఆరోజు బుధవారం. సుమారు 10 గంటలవుతోంది. నేనప్పుడే గ్రంథాలయంనుంచి యింటికి తిరిగి వచ్చేను నేను వాసలో ఎక్కడికో వెళ్లానని మానాన్నగారు చకచకా తిట్టి అప్పుడే భోజనానికి కూర్చున్నారు. ఈసంగతి అర్జంటు టెలిగ్రాములాగ నేను యింకా ఇంటిలో తిన్నగా అడుగయినా పెట్టకుండా మా తమ్ముడి ద్వారా అందింది కనపడితే కోపం హెచ్చుతుందనే భయంతో నేను వంటింట్లో కెళ్ళి కూర్చున్నాను.

మా యింట్లో ఓ వంద మామిడి కాయలకాపుంది. అవి ముగ్గినయి. వానికోసమని మే మప్పుడే రెండు రోజులనుండి ఎదురుచూస్తున్నాము.






అవి అమ్మ పంచుతుంటే మా కన్యాయం జరుగుతూవుందని నాన్నగారితో ఫిర్యాదు చేయడంవల్ల, ఆ రోజు మానాన్నగారే మామిడిపళ్లు పంచుతున్నారు

మేముచిన్న పెద్ద, ఆడ, మొగ అందరూ కలసి మొత్తం దశకి చేరేము. నాన్నారు తలా ఒక తొమ్మిదిపళ్ళు ఇచ్చి, పందొమ్మిది

శ్రీ దంతులూరి

పళ్లను తనకు చుట్టాలకు, అతిథులకు అట్టే పెట్టుకున్నారు మనిషి కెన్నెన్ని యిచ్చారో మాతమ్ముడు గట్టిగా అరవడంవల్ల నాకు తెలిసిందిగాని యింకా వివరాలేమీ తెలియలేదు.

మానాన్నగారి భోజనం పూర్తి అవడం, ఆయన పడుకోటానికి వెళ్లడం జరిగాయి. వెంటనే నేను గబగబ వచ్చి నావాటా మామిడి పళ్లు దాచేసుకున్నాను అమ్మ నాకు, అన్నయ్యకు వడ్డన చేసింది. మేము భోజనాలకు కూర్చున్నాము ఇంకా మా బాజ్జన్నయ్య పులుసూ అన్నంలో వుండగానే నేను భోజనం పూర్తి చేసి యింట్లోకి వెళ్ళేను. మెల్లిగా నాకాయల్లోని చిన్నకాయ ఒకటి ఏరి మా అన్నయ్య కాయల్లో పెట్టి, వాటిలో నుండి ఒక పెద్దకాయ తెచ్చుకున్నాను

అన్నయ్య భోజనం పూర్తి అయింది. తిన్నగా తన పళ్లవద్దకు వెళ్లి పరీక్షిస్తున్నాడు. ఉన్నట్టుండి వాడొక్కసారిగా 'అమ్మా' అని గావుకేక పెట్టాడు

'ఏరా పెద్దబ్బాయి కేకేశావు?' అంటూ అమ్మవచ్చింది

'అమ్మా నరిసిగాడికాయ లొక సారిలా తెమ్మనవే',

'ఎందుకురా ?'

'తెమ్మనుమంటే ఎందుకో నీకే చూపెడతాను '

'ఏరా, నరిసీ నీ కాయ లిలా పట్రారా' అంది

వెళ్లి జల్లెడ జల్లెడపళంగా తీసుకొచ్చేను. (మా అమ్మ నావాటా పళ్లు జల్లెడలో పెట్టియిచ్చింది.)

మా అన్నయ్య నా కాయలన్నింటిని తిరగవేసి, జాగ్రత్తగా అపరాధ పరిశోధకాగ్రేసరుని ముఖభంగిమతో చూశాడు నేనే పండయితే కొట్టేశానో, అదే పండు తీసి, "అమ్మా చూశావా? వీడు నా మామిడి పండు కొట్టేసి లెక్కకు అక్కడో చిన్నకాయ పడేశాడు చూడు" అన్నాడు అన్నయ్య

'ఏడిసినట్టుగా వుంది ఇదే మన్యాయమట్రా బాబూ, ఆకాయ నాదే' అన్నాను.

'అమ్మ వీడి బుకాయింపు బంగా రంగాను, యింకా దబాయింపు గూడానా' అని ఆ పండుమీద వేసిన 8 నెంబరు చూపించాడు ఇప్పటికి తెలిసింది నాకసలుసంగతి మా బొజ్జన్నయ్య తన కాయలెవరూ దొంగిలించకుండా, మార్చకుండా, అంటే పెద్దవాటికి బదులు చిన్నవి రాకుండా, తన మామిడి పండ్లకు కిందికొసను పెన్నుతో నంబర్లు వేసుకున్నాడన్నమాట!

దొరికిన దొంగేం చేస్తాడు చెప్పండి! తలవంచుకుని నిలబడ్డాను. ఇంతట్లో అమ్మ అన్నయ్య పళ్లన్నీ చూసి 'ఏరా పెద్దబ్బాయి! యీ పండు ఎక్కడిదిరా' అంది.

'అదే అమ్మా. నాన్నగారూ. నువ్వు కాయలు పాటా వేసినప్పుడు దొర్లి నాపాటాదగ్గర కొచ్చిందే. వచ్చిందెలాగా వచ్చిందిగదా అని యింకో చిన్నకాయ అలాగ దొర్లించేశానే' అన్నాడు బొజ్జ అన్నయ్య

"పెధవలు యిద్దరికిద్దరే" అంటూ అమ్మ ఎవళ్లపళ్లు వాళ్లకిచ్చి వెళ్లిపోయింది.



నేనే పండయితే కొట్టేశానో అదే పండుతీసి "అమ్మా చూశావా? వీడు నా మామిడి పండు కొట్టేసి లెక్కకు అక్కడో చిన్నకాయపడేశాడు చూడు"అన్నాడు అన్నయ్య.

రాత్రి భోజనాలదగ్గర అమ్మ యీగొడవంతా నాన్నగారితో చెప్పింది నాన్నగారు "అయితే ఆకాయ నరిసిగాడిదని నీకెలా కనిపెట్టావే" అన్నారు. "ఏం లేదండీ! ఈ పెధవలసంగతి తెలిసే నరిసి మూర్తి కాయల ముచ్చికలు గోటితో గుచ్చానండీ" అంది.

"అందరూ దొంగలే" అని నాన్నగారు నవ్వేశారు. ★

# వింత వివాహం

"ఉషా..ఉషా..అబ్బ-ఎక్కడి కెళ్ళావే"? అంది మహ లక్ష్మి.

"ఇదిగో అమ్మా వస్తున్నాను ఎందుకలా గొంతు చించుకొం టావ్?"

"ఏం లేదమ్మా ఇవాళ నాలు గ్గంట్లకి ఇంట్లోనే వుంటావు కదూ?"

"ఇవాళా .కాలేజీలో మీటింగు వుందే, వెళ్ళాలి"

"ఎప్పుడూ మీటింగు, టీటింగు అని కూచుంటే ఎలాగ? ఇవాళ నిన్ను చూడ్డానికని పెళ్ళివారు వొస్తున్నారే. అందుకని ఇంట్లోనే వుండమ్మా"

"అబ్బ పోవేఅమ్మా నీకెప్పుడూ పెళ్ళి గొడవే"

"మా తల్లికదూ. ఈ పూటకి వుండిపోమ్మా"

"సరేలే"

ఉష వెంకటేశంగారి కూతురు. ఒక్కతే ఆడపిల్ల గనుక అల్లారు ముద్దుగా పెరిగింది ఇంటర్ చదువుకొంటోంది కొంచెం టిప్ టాపుగా వుంటుంది రాముం ఉష అన్నయ్య

నాలుగ్గంట్లయ్యే సరికల్లా ఉష చక్కగా ముస్తాబయింది ఇంతలోకి పెళ్ళివారు, ఉష నాన్నగారు, అన్నయ్య అందరూ వస్తున్నారు.

"అమ్మా-అమ్మా వాళ్ళంతా వస్తున్నారే"

"రానీమ్మా అలా తొందర పడతా వెందుకూ?"

"రండి, కూర్చోండి" అంటూ పెళ్ళివారికి మర్యాద చేసింది మహ లక్ష్మి

పెళ్ళి కొడుకు పేరు భాస్కర్ ఇతను కుటుంబరావుగారి ఏకైక పుత్రుడు. బి ఎల్ చదువుకొంటు న్నాడు. ఈతని బామ్మకి మడి, ఆచారం చాలా ఎక్కువ

ఇందిర

"అమ్మా నీ పేరేమిటే తల్లీ కొంచెం గట్టిగా చెప్పమ్మా ముసిలి దాన్ని కదూ? బాగా వినిపించదు" అంది బామ్మగారు

"ఉష! అండి బామ్మగారు"

"ఏవిటీ-ఉషా! ఉష, విషమా? ఇదేం పేర్లమ్మా చక్కగా ఏసీతా లక్ష్మనో, మహాలక్ష్మనో పెట్టు కోక పోనీలే ఏం చదువుకొంటున్నా వమ్మా?"

"ఇంటర్ చదువుకుంటున్నా నండి"

"ఏవిటీ ఇట్టరూను, చిట్టరూను ఇందేం చదువులమ్మా, ఆడపిల్లలు కూడా మొగపిల్లల చదువేలా చదువుతున్నా రేవిటమ్మా? సరే కానీ, నీకేవన్నా పాటలొచ్చా ఉషా? వస్తే ఒక్కటి పాడమ్మా"

"మా అమ్మాయికి సంగీతం చెప్పించలేదండి ఏదో కొన్ని పాటలు మటుకు పాడుతుంది. ఉషా ఏదైనా వొకటి పాడమ్మా"

"మనసులో ని మనసా..." అంటూ పాడింది ఉష.

"ఇదేం సోగ్యవే కోడలా, చక్కగా ఏగాయత్రి మీదో, సావిత్రీదేవి మీదో పాడక ఏవిటో మనసులోని మనసాట! బాగానే వుంది!"

"అత్తయ్యా మీరలా అంటోంటే అమ్మాయి గాభరాపడి పోతుంది"

"వూరుకోవే చాలు నేటి కాలానికి అత్తగారిని ఆజ్ఞపెట్టడానికి తయారయ్యావు ఆయన పోయాకే ఈకొడుకూ, కోడలూను నన్ను చంపుకు తింటున్నారు. ఈ సోద్యవేవిటమ్మా... ఆ రెండు జళ్ళేవిటే? ఎలక తోక ల్లాగా? చక్కగా వాలు జడేసుకో కూడదూ? ఆపక్క పాపిడేవిటే? పైగా పక్క పిన్నీసులు కూడా పెట్టింది చాలా వింతగావుందే! చేతినిండా గాజులేసుకోక ఆచేతికి ఆనల్లపట్టి ఏమిటే, ఒహో, రిస్టు వాచీ గాజోలు, బాగానేవుంది. కనీ కనిపించని ఆసన్నని బొట్టే విటి? ఇలాంటి కోడల్ని తెస్తే, ఒరే అబ్బాయి, నే చెపుతున్నాను చూడు, మనకొంప మునిగిందన్న మాటే"

నీ అధికారం ఎక్కువై పోతోంది ఆ అమ్మాయిని అలా

వేపుకు తింటా వెందుకూ?" అన్నాడు పెళ్ళికొడుకు

"చాల్లేరా నన్నన డానికి నువ్వొచ్చావిరా? నిన్నగాక మొన్న పుట్టేవు నన్నే దబాయిస్తున్నావే ఏదో పెద్దదాన్ని గదా, మనవడికి మంచి సంబంధం చేసుకొందామని నే నెంతో ఆశపడుతోంటే, నాకే వచ్చాయి చివాట్లు, బాగానేవుంది నాయనా.. పెళ్ళి గాకముందే పెళ్ళాన్ని వెనకేసు కొస్తున్నావే? ఒసే ఉషా - నీకు వంట చేయడం వచ్చా?"

"వచ్చండి బామ్మగారు అన్నం, చారు, వేపుడు కూరలవి చేస్తానండి"

"పచ్చిపులుసు చేయడం వచ్చునే?"

"రాదండి"

"రాదంటే మీవన్న మాటే? అంత తేలికయిందే రాకపోతే ఎలాగ? ఏమండీ? మీ అమ్మాయికి వంట గింట ఏవీ నేర్పలేదేవిటి?"

"అమ్మాయి కాలేజీ నుంచి ఇంటికొచ్చేసరికే అలసి పోతుందండీ అంచేత వంట అంత బాగా అలవాటు లేదు"

"అబ్బ ఎంత సుకుమారివే! అలసిపోతుందిట అలసిపోతుంది. ఏం, మేమంతా ఈవయస్సులో గుండిగెడు అన్నం చేయుతుంటే, చేసి చక్కా వుంచేవాళ్ళం. ఇలా వుంటే ఇంక బాగానే వుంటుంది"

"అమ్మా, నీ అధిక ప్రసంగం చాలించింక ఇంటి కెడదాంలే ఇంకెప్పుడూ కూడా మే మిక్కడి కొచ్చినా నిన్ను తీసుకెళ్ళం బాబు"

"చాలా బాగుంది నాయనా. కనీ, పెంచి పెద్దవాడ్ని చేసినందుకు చాలామంచి బహుమతిఇస్తున్నావు. ఇంతకీ నాఖర్మం ఆయనే పోయే బదులు నేనే చచ్చిపోతే బాగుం డేది నేనొక పాపిని. ఏదో ఇది ముసిలిదిగదా దీనిఏడుపు ఇది ఏడవని అని అన్నవాళ్ళు వాళ్ళూ లేరు కదా!" అంటూ ఏడుస్తుంది.

"అమ్మా ఏడవకే బాబు, వెధవ అప్రదిష్ట కూడాను ఏమండీ వెంకటేశంగారు మేం వెడుతున్నామండీ ఇంకోరోజెప్పుడైనా మాట్లాడుకొందాం"

ఇంక పెళ్ళివారు వెళ్ళిపోయాక ఉష సంగతడుగుతారా... ఉష ఒక్కటే ఏడుపంటేఒక్కటేఏడుపు.



పావురాలకి మేత

ఫొటో. శ్రీ యస్. రాజా (భీమవరం)

## ★ వింత వివాహం ★

ఎవరు చెప్పినా వినదు రామం ఎంతో చెప్పేదు "ఒసే ఆముసలావిడ మాట్లకేవిటి. ఆవిడ అల్లాగే అంటూంటుంది ఆవిడ కెలాగైన బుద్ధిచెప్పాలి. నేనూ గోపాలం కలసి ఏదైనా ఉపాయం ఆలోచిస్తాం. భాస్కర్ చాలా మంచివాడు తెలుసా? అతనికే నిన్నిచ్చి పెళ్ళి చెయ్యాలే".

"అన్నయ్యా నువ్వూరుకో బాబు ఏం చెయ్యబోకు"

"నీ కెందుకే అదంతాను. మేం చూసుకొంటాంగా"

గోపాలం, రామం కలిసి మంచి ఉపాయం ఆలోచించారు ఆ ఉపాయాన్ని ఉషకి తెలియజేసేరు. ఉష వారి యుక్తికి చాలా సంతోషించింది ఉష కుటుంబం అంతా గోపాలం ఇంటి కెళ్ళేరు.

గోపాలం ఉష తలి తండ్రులని, రాముని గదిలో వుండమన్నాడు ఉషకి అచ్చంగా పూర్వకాలపు ముత్తయిదు లాగా ముస్తాబు చేసేరు

గోపాలం ఇంటికి మునుపటి పెళ్ళి వారినే పిలిపించారు యధా ప్రకారం ముసలావిడ కూడా తయారయింది.

సరే పెళ్ళివారొచ్చారు.

గోపాలం చెప్పడం మొదలెట్టేడు. "ఈ అమ్మాయి మా పెదనాన్నగారి కూతురు. తల్లీ, తండ్రీ ఎవ్వరూ లేరు నేనే పెంచుతున్నాను. తరుడు ఫారం చదివి మానేసింది ఎక్కువ చదువేమీ చెప్పించలేదు లెండి"

"ఆ చాలు నాయనా...ఇట్టరు బిట్టరు చదవటంలేదు కదా - అమ్మా నీ పేరేవిటే తల్లి?"

"సీతాలక్ష్మి అండి బామ్మగారు"

"అబ్బో, ఎంత బాగుందే పేరు నీకు పాటలొస్తే ఒక్కటి పాడమ్మా"

"శ్రీసరస్వతి... నమోస్తుతే..." అని పాడింది.

"ఎంత ఆనందంగా వుందే తల్లీ! ... చక్కగా ఇలాంటి పాటలు పాడితే ఎంతో బాగుందమ్మా...

బాగుంది ఎంచక్క మధ్యపాపిడి తీసింది వాలు జడేసింది మొన్నటి పిల్లలాగ పక్కపిన్నీసులు, గిక్క పిన్నీసులు, ఏవీ లేవు బాబు అచ్చంగా లక్ష్మి పార్వతిలాగ, ఆ పెద్ద బొట్టు, చేతినిండా గాజులు ... ఆవిషయం ... అంతా నచ్చిందే తల్లీ ... అమ్మయ్య నేటి కాలానికి మంచిపిల్ల దొరికింది. ఏవే కోడలా, మాట్లాడవేమే? కోపం గాబోలు. ఇంత మంచి సంబంధం వదులుకుంటే మరో సంబంధం దొరుకుతుందా ఒరే అబ్బాయి బెల్లంకొట్టిన రాయిలాగ నువ్వయినా మాట్లాడ వేంరా? నేనో ముసలి గొడ్డుని నామాట ఎవ్వరు వినిపించు కొంటారు?"

"బామ్మగారు, మాఅమ్మాయి పచ్చిపులుసు చాలా బాగా చేస్తుందండీ ఆఒక్క పులుసుతోనే మీకు కడుపునిండి పోతుందండీ గుండిగెలతో అన్నం వండగలదు అన్ని పనులు చాతవ్వు"

"నాయనా, పిల్లనాకు నచ్చింది ముమ్మాటికి నచ్చింది"

"అయితే తప్పకుండా మా అమ్మాయిని మీ మనువడికి చేసు కొంటారా?" అన్నాడు గోపాలం

"అయ్యో నా మాట కింక తిరుగుంటుందా? ముమ్మాటికి తిరుగుండదు అయితే నాకొడుకూ కోడలు ఏవీ మాట్లాడ్డం లేదు. ఏం చెయ్యను?"

"బామ్మగారు, అదంతా మీ కెందుకు లెండి వాళ్ళని ఒప్పించే బాధ్యత నాది మీరు సైఅంటే చాలు"

"ఇంకెన్నిసార్లు చెప్పను బాబు? పార్వతీ పరమేశ్వరుల సాక్షిగా చెపుతున్నాను ఈ సీతాలక్ష్మినే నామనవడికి చేసికొంటాను సరేనా?"

"బాగుందండి బామ్మగారు, ఒరే రామం మీరందరూ ఇలా రండి. నీ చెల్లెలికి పెళ్ళి నిశ్చయమయిందిరా.."

రామం, కుటుంబరావు గారు, అందరూవచ్చారు అందరూ వీరిని చూచి తెల్లబోయారు.

"ఇదేవిటి, వీరందరూ ఇక్కడి కెందు కొచ్చారు?" అంది బామ్మగారు

"అబ్బే ఏం లేదండి బామ్మగారు ఈ సీతాలక్ష్మి మొన్న మీరు చూచిన ఉష వీరు ఉష తల్లి దండ్రులు. ఉషకి ఇలా వేషం వేశాం అంతేనండి"

"కొంప ముంచేశారు మాట ఇచ్చేశాను కదా, ఇంక ఎలాగ? నేనిక్కడుంటే నా మర్యాదదక్కదు. ఒరే అబ్బాయి నేను ఇవ్వాళే ఏ కాశీకో రామేశ్వరానికో, వెళ్ళి పోతున్నాను మీరు హాయిగా వుండండి ఇదిగో వెళ్ళిపోతున్నా" అంటూ వెళ్ళిపోయింది.

ఉషకి, భాస్కర్ కి వైభవంగా వివాహం జరిగింది. 

# ★ "చండీరాణి" సమీక్ష ★



'చండీరాణి' నిర్మాత రామకృష్ణ

క్రిందటి నెల 28వ తేదీన భారతదేశమంతటా విడుదలయిన భరణీవారి "చండీరాణి" భారతీయ సినిమా చరిత్రలో ప్రత్యేక స్థానం ఆక్రమించుకున్నది. మూడు ప్రధాన దేశభాషల్లో ఒకేసారి తయారుకావటం, మూడు భాషల్లోనూ ఒకేసారి విడుదల కావటం, ఒక స్త్రీ తార కథ, దర్శకత్వం, సంగీతం, ఆ తార రెండు ప్రధానపాత్రలు ధరించటం ఇవన్నీ "చండీరాణి"కి ప్రత్యేకత ఆపాదిస్తున్నాయి. ఈ కారణంవల్ల ఈ చిత్రం దాక్షిణాత్య సినిమా పరిశ్రమకూ, ముఖ్యంగా తెలుగు పరిశ్రమకూ గర్వకారణమైంది.

"చండీరాణి"కి కథారచన, దర్శకత్వం భానుమతి, నిర్మాణం, ఎడిటింగ్ రామకృష్ణ, పాటలు, మాటలు సముద్రాల, ఫోటోగ్రఫీ శెల్వరాజ్, సౌండ్ కోటేశ్వరరావు, సంగీతం సి. ఆర్. సుబ్బరామన్, విశ్వనాథన్, కళ శేఖర్. భానుమతి, ఎన్. టి. రామారావు, రంగారావు, రేలంగి, విద్యావతి, కులకర్ణి, హేమలత, దొరస్వామి, అమర్‌నాథ్, మున్నగువారు నటించారు.

వీరసింహుడనే రాజు ఒక పేదపిల్లను మోహించి వివాహం చేసుకుంటాడు. ప్రచండుడు అనే సేనాపతి కూడా ఆమెనే మోహించి వున్నందున ఆమెను తనకు దక్కనివ్వలేదనే కోపంతో రాజుపై పగ తీర్చుకోదలుస్తాడు. రాణి గర్భవతియై కవల ఆడపిల్లలను కంటుంది. వెంటనే ప్రచండుడామెకు విషమిచ్చి చంపుతాడు. భార్యా మరణంతో మతి చలించిన రాజును ఖయిదు చేస్తాడు. విశ్వాసపాత్రుడైన మంత్రి కవలపిల్లలలో ఒకరిని ప్రచండుని చేతుల్లో పడకుండా దాసీద్వారా సురక్షిత ప్రదేశానికి పంపుతాడు. రెండవ పిల్లను స్వయంగా కోటవెలుపలికి తీసుకు వస్తుండగా ప్రచండుడు చూసి, మంత్రిని చంపి, పిల్లను లాక్కుంటాడు. ఆ పిల్లను తన కొడుక్కిచ్చి వివాహం చేయాలనే తలపుతో జాగ్రత్తగా పెంచుతాడు. అడవికి చేర్చబడిన పిల్ల చండీ అనే పేరుతోను, అంతఃపురంలోని పిల్ల చంపా అనే పేరుతోను పెరిగి పెద్దవారవుతారు. చనిపోయిన మంత్రికొడుకు కిశోర్ కూడా పెరిగి పెద్దవాడవుతాడు. తన తండ్రి ఎలా మరణించిందీ, ప్రచండుడెలా రాజ్యం సంపాదించిందీ తన్ను పెంచిన రామ్‌సింగ్ అనే భృత్యునిద్వారా తెలుసుకుంటాడు. రాజవంశాన్ని ఉద్ధరించడానికి దీక్ష పూని, అంతఃపురంలో చంపను, అడవిలో చండీని కలుసుకొని తన దీక్ష తెలియజేస్తాడు. చండీ, చంపా, ఇద్దరూ అతన్ని ప్రేమిస్తారు. కాని అతడు చంపను మాత్రమే ప్రేమిస్తాడు. చండీ ఈ సంగతి తెలిసి తన ప్రేమ త్యాగం చేస్తుంది. ప్రచండుని దురాగతాలు అంతమొందించడానికై ప్రజా విప్లవం లేవదీసి ప్రచండునిపై దండెత్తుతుంది. అతనితో యుద్ధం చేసి చంపివేస్తుంది. కాని ఆ పోరాటంలో ఆమెకు కూడా గాయం తగులుతుంది. చెరలోవున్న తండ్రిని, మిగతా వారిని రక్షించి తను చనిపోతుంది. చంపా కిశోర్‌లకు వివాహం జరుగుతుంది.

ఈ చిత్రం ఆశయం సామాన్య ప్రేక్షకులకు వినోదం, కాలక్షేపం కలిగించడమే అయితే, చాలవరకు నెరవేరిందనే చెప్పాలి. మనస్సును కాసేపు నిద్రబుచ్చి కళ్ళతో మాత్రమే చూసి ఆనందించగలిగితే ఈ చిత్రం తృప్తికరంగా వుంటుంది. సాధారణంగా మన జానపద చిత్రాలన్నీ ఇలా చూడదగినవే. ఆలోచించ సాగినకొద్దీ, ప్రశ్నించ మొదలిడినకొద్దీ కథలో ఎందరో లోపాలు కనిపిస్తాయి.

పేదపిల్లను రాజుతోపాటు ప్రచండుడు కూడా మోహిస్తాడు. ఆమెను రాజు వివాహమాడటంచే బాధపడతాడు. అంత బాధపడినవాడు నిర్దాక్షిణ్యంగా ఆమెను చంపి, రాజును ఖయిదు చేస్తాడు. ఆమెను చంపి రాజుపై పగదీర్చుకోవడానికి ఆమెకు సంతానం కలిగే దాకా ఆగవలసిన అవసరం లేదు.

కవల ఆడపిల్లల మూలంగా కథకు కలిగిన ప్రయోజనమేమీ లేదు. చంప పాత్ర లేకపోయినా కథ సాగించడానికి వీలున్నది. చంప పాత్రను ప్రవేశపెట్టినప్పుడు, ఆమెకూ చండీరాణికీ గల పోలికను పురస్కరించుకొని కథలో విచిత్ర సంఘటనలు ప్రవేశపెడితే బాగుండేది. నిజానికీ పోలిక సరిగా ఉపయోగించుకోబడనే లేదు. చంప స్థానంలో చండీ ఉండటం వల్ల, ప్రచండునికి గాని, అతని కొడుకుకు గాని మోసపోయిందీ, నష్టపడిందీ ఏమీ లేదు. అలాగే, చండీరాణి పెద్దపులితో యుద్ధం చేసి చంపిన సీక్వెన్సు కూడా మొదట ఆసక్తి కలిగించి కథాగమనంలో పరిణామాలకు దారి తీయకుండానే వృథా అయిపోయింది. చండీకి తండ్రి చెప్పిన రహస్యద్వారం సంగతి కూడా చివరికి వృథాగా వదలివేయబడింది. అడవిలో కోయ దొరకూ చండీకి వైరం, కోయదొర చండీని పెంచిన దాసిని తగలపెట్టించడం వగైరా సన్నివేశాలు ఇలాగే వ్యర్థంగా ప్రవేశపెట్టబడినవి. కథానాయకుడైన కిశోర్ పాత్రకూడా కథలో సాధించినదేమీ లేదు. ఒక్క చండీరాణి పాత్ర గొప్పదనంకోసం మిగతా పాత్రలన్నీ బలా



ఫోటోగ్రాఫర్ : శెల్వరాజ్

గౌరిని కష్టాలనుండి గట్టెక్కించడానికి దేవకన్య అచల వచ్చి, గౌరిని చందన రాజువద్దకు తీసుకువెడుతుంది.

విజయావారి "చంద్రహారం" లో కాంతాదేవి, శ్రీరంజని

కళాదర్శకుడు శేఖర్

ఇట్లాంటివి మినహాయిస్తే భానుమతి దర్శకత్వం బాగానే వున్నది కోయదొరతోను, ప్రచండునితోను చండీరాణి చేసిన కత్తి యుద్ధాలు చేజింగ్ దృష్ట్యా బాగున్నాయి కథ వీలిచ్చినంతవరకూ చిత్రంలో సస్పెన్సు పోషించబడింది భానుమతి రెండు భిన్న పాత్రలనూ రక్తివంతంగా పోషించింది ఆమె అభినయం ఈ చిత్రంలోకల్లా "హైలైట్" అనదగినది కిశోర్ గా ఎన్ టి రామారావు, మూర్తీభవించిన విలన్ గా రంగారావు రాజుగా అమర్ నాథ్ సమర్థతతో నటించారు రేలంగి హాస్యరటన ప్రేక్షకులకు కావలసినంత వినోదం కలిగిస్తుంది

ఉన్న కొదిపాటయా కర్ణపేయంగా ఉన్నాయి కామెరామన్ శెల్వరాజ్ ట్రిక్ షాట్లు జయప్రదంగా తీశారు రాజభవనం సెట్ వగైరా కథా వాతవరణానికి భాగాతో సృష్టాయి చిత్రం పాసవుకూడా నేటి చిత్రాలకంటె తక్కువే ఉన్నది

కథా లోపం తప్పిస్తే, డైరెక్టరుగా, అభినేత్రిగా భానుమతికి "చండీరాణి" వ్యక్తిగత విజయం సాధించి పెడుతున్నది ఈ చిత్రం ఇచ్చే ప్రోత్సాహంతో ఆమె ఇంకా మంచి మంచి చిత్రాలు తీయగలదని ఆశిస్తున్నాము ★

## సినిమా వార్తలు

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిం కంపెనీవారి తెలుగు తమిళ్ సాంఘిక చిత్రం "లక్ష్మి" నిర్మాణం దాదాపు ముగియవచ్చింది అనుకున్న షెడ్యూలుప్రకారం షూటింగ్ జరిపారు ఆఖరి సెటుమీద షూటింగ్ మిగిలివుందనీ, ఇంకా మిగిలిన పనికూడా ఈ నెలలోనే పూర్తి చేయగలరనీ తెలుస్తున్నది అక్టోబరు ఒకటో తేదీకి తెలుగు చిత్రం విడుదల చేస్తారట శ్రీ కదారి

కరిస్తాడు. జమీందారు తన పాతబాకీల కింద ఆ పొలం జమకట్టుకోవాలని కోర్టు ద్వారా డిక్రీ సంపాదిస్తాడు. శంభూ కూడా తన పొలం తనచెయ్యిదాటి పోకూడదనే పట్టుదలతో, జమీందారుకు బాకీవున్న 200 పైచిల్లరా తీర్చివేయడానికి సంకల్పిస్తాడు. బాకీ తీర్చడానికి మూడు నెలలు మాత్రమే వ్యవధివున్నది. ఆ డబ్బు సంపాదించేందుకు శంభూ ఒక స్నేహితుడి సలహామీద కలకత్తా బయలుదేరతాడు. అతనితోపాటు కొడుకు కూడా తయారవుతాడు. కలకత్తాలో ఇద్దరూ జీవనోపాధి కోసం అన్వేషణ సాగిస్తారు. అదృష్టవశాత్తూ శంభూకి రిక్షాలాగే పని లభ్యమవుతుంది. కొడుకు వేడినీళ్లకి చన్నీళ్లతోడన్నట్లు, తను బూట్ పాలిష్‌పని చేసి దానిమీద కొంతడబ్బు సంపాదిస్తాడు. ఒకరోజున రిక్షా లాగుతుండగా శంభూ ప్రమాదానికి లోనయి మంచంపడతాడు. కొడుకు పట్నానికి రమ్మని తల్లికి ఉత్తరం రాస్తాడు. ఆమె భర్త అనారోగ్యంవిషయం తెలుసుకుని గాభరాగా పట్నం వచ్చేస్తుంది. అక్కడ ఒక దుర్మార్గుడి చేతిలో చిక్కి, తప్పించుకునే ప్రయత్నంలో కారుకింద పడుతుంది. భార్యాభర్తలు కలుసుకుంటారు. భార్యకు గాయాలు నయంకావడానికి చాలరోజులు పడుతుంది. ఈలోగా మూడునెలల గడువు దాటిపోవడమే గాక, శంభూ, భార్యాపుత్రులతో స్వగ్రామం తిరిగి వచ్చేసరికి అతని పొలంలో బ్రహ్మాండమైన ఫ్యాక్టరీ నిర్మించబడివుంటుంది. తండ్రి పిచ్చివాడై ఎటో వెళ్లిపోయి వుంటాడు. శంభూ హతాశుడై భార్యాపుత్రులతో వచ్చినదారే పట్టి, నేలనించి వేళ్లతో సహా పెళ్లగించబడిన అభాగ్య భారతీయ కర్షకులవలెనే, వేరే కొత్తజీవనాన్ని అన్వేషించుకుంటూ వెళ్లిపోతాడు.

తరతరాలుగా మన దేశంలో మన కళ్లఎదుటనే జరుగుతున్న ఈ చరిత్ర ప్రేక్షకుల హృదయాలను కలచివేస్తుంది. కథావస్తువు పాతదేఅయినా, సరికొత్తగా చిత్రించడంలో బిమల్ రాయ్ ప్రతిభ కనబరచాడు. ప్రారంభ దృశ్యంలోనే కథను సూచించడానికి, రైతులు వారి ఒక్క నీటిచుక్కకోసం వెయ్యినోళ్లు తెరుచుకున్న నేల కనిపిస్తుంది. నీటిబరువుతో కదిలి వచ్చే మబ్బులు చూసి, వర్షాగమనానికి నృత్యం చేసే నెమళ్లలాగా రైతులు ఆడుతూ పాడుతూ వర్షోత్సవం చేస్తారు. ఈ విధంగా చిత్రం అంతటా వెలుగు నీడల్లాగా ఒకదానివెంట ఒకటి వచ్చే చిన్నచిన్న సంతోషాలు కష్టాలు చూపించబడ్డాయి. ప్రతిపాత్రా, మనమెక్కడో ఎరుగుదుమా అన్నంత వాస్తవికంగా పోషించబడింది. రైతు శంభూ, అతనికి పొలంమీదగల ప్రేమ, భార్యాబిడ్డలమీద ప్రేమ, అతని నిజాయితీ, ఇదంతా ఎక్కడా అతిశయోక్తి దోషం లేకుండా చిత్రించబడింది. కలకత్తాలో శంభూ కొడుక్కి బూట్ పాలిషింగ్ నేర్పే కుర్రవాడూ, జేబుదొంగతనం చేసే కుర్రవాడూ, శంభూకి రిక్షా యిచ్చిన రిక్షావాలా, గది అద్దెకిచ్చిన యజమానురాలూ,



★

పారమౌంట్ వారి "మిలిటరీ పోలీస్‌మన్" లో బాబ్ హోప్, మేరిలిన్ మాక్స్‌వెల్

★



ఈ నేల, బాగానులు లకులాది ప్రతుం సుఖదుఃఖాల మీద ఆధారపడే వుంటాయి

"దో బిఘా జమీన్"లో బల్రాజ్ సహాని, రతన్‌కుమార్.

# ప్రశ్నలు..సమాధానాలు

"మహమ్మద్"—బరంపురం.

స్త్రీలు సినిమాకు వెళ్ళేటప్పుడు, ప్రత్యేకంగా పూర్తి అలంకరణ చేసుకొనుటకు కారణం తెలియపరుస్తారా?

—స్త్రీలు సహజంగా అలంకార ప్రియులు అసలు అలంకరణాన్ని ఒక లలిత కళగా చేసింది స్త్రీలే అయితే మద్రాసు లాంటి పట్టణాల్లో, స్త్రీలుకూడా సిగ్గుపడి తలవంచుకు నేటంత అలంకారాలు చేసుకుని తిరిగే యువకులు వీధుల్లో కనిపిస్తుంటారు

* * *

శ్రీ నాగోజి గోపినాథ్—హాస్పేట

"మంచి చిత్రాలనూ, చెడు చిత్రాలనూ బాగున్నాయనే విమర్శించాలి లేకపోతే అవి దెబ్బతింటాయి" అని అన్నారే, చెడు చిత్రాలను బాగున్నాయంటే ప్రజలలో మీ పత్రికపై గల మోజు తగ్గదాండీ?

—ఆ ముక్క మేమెప్పుడూ అనలేదు మరెవరైనా అన్నారేమో మాకు తెలియదు. చెడు చిత్రాలను బాగున్నాయని మేమెప్పుడూ వ్రాయలేదని గమనించ ప్రార్థన

* * *

శ్రీ బి యస్. చలపతిరావు—హనుమకొండ.

మీరు 2 9-1953 వారపత్రికలో రోహిణీవారి 9వ చిత్రమని వ్రాశారు. ఆ చిత్రము పేరు తెలియజేయగలరా?

—ఆ చిత్రాని కింకా నామకరణం చేయలేదు

శ్రీ ఎ నాగేశ్వర్‌రావు కుమార్తె నామకరణానికి విందు జరిపారని వ్రాశారు ఆమె పేరు తెలుపగలరా?

—ఆమెకు సత్యవతి అని పేరుపెట్టారు.

* * *

శ్రీమతి అక్కల కమల—కొండపల్లి

"పిచ్చిపుల్లయ్య"లో పుల్లయ్యను ఏమీ తెలియని పిచ్చివాడుగా చూపించారు ఈ రోజుల్లో కూడా మరీ అంత పిచ్చి అమాయకులు వున్నారంటారా?

—ఉంటే ఉండవచ్చు అటువంటి వానిపై సానుభూతి చూపించగలంగాని, ఆదర్శ వ్యక్తిగా భావించలేము

* * *

శ్రీ మాకేటి నరసింహారావు—కొల్లూరు

"ప్రతిజ్ఞ" మ్యూజిక్ డైరెక్టరెవరో తెలుపగోరెదను.

—శ్రీ అశ్వత్థామ, కల్యాణంగార్లు

* * *

శ్రీ సి. హెచ్. ప్రసాదరావు—వాల్తేరు

నాగేశ్వరరావు స్వంత ఫిలిం కంపెనీ స్థాపించినట్లు విన్నాను ఆ చిత్రం పేరు, దాని దర్శకుడు, నటీనటులను వివరంగా తెలియజేస్తారా?

—వారి సంస్థ పేరు అన్నపూర్ణాపిక్చర్సు చిత్రం పేరు "దొంగరాముడు". శ్రీ కె వి. రెడ్డి డైరెక్టు చేస్తారట నాగేశ్వరరావు కాక మిగతా తారాగణం ఇంకా నిర్ణయం కాలేదట.

* * *

శ్రీ జి రాజగోపాలరావు—విజయవాడ.

తెలుగు హిందీ సినిమా తారల్లో తన పాత్ర తాను అర్థం చేసుకొని యాక్టు చేయగల సమర్థత ఎవరి కున్నదండి?

—నటీనటులకు వారివారి పాత్రలు అర్థం అయ్యేట్లు చేసి, నటింపజేసే బాధ్యత డైరెక్టరుది. సినిమా కళ నటీనటుల వ్యక్తిగత కౌశలంమీద ఆధారపడిన కళ కాదు డైరెక్టరు భావుకత లేనివాడైతే, ఎంత మంచి నటులున్నా చిత్రం రక్తికట్టదు భావుకతగల డైరెక్టరు తన పాత్ర ఏమిటో తనకే తెలియని నాలుగేళ్ళ పిల్లవానిచేత కూడా బాగా నటింపజేయగలడు. "యాంకీ వారీసూ", "బైసికిల్ థీవ్స్" చిత్రాల్లో బాలకుల నటన చూడండి "దో బిఘా జమీన్"లో ప్రతి ఉప పాత్రా ఎంత బాగున్నదో చూడండి

* * *

శ్రీ పొట్లూరి శ్రీనివాసరావు పుయ్యూరు

దేశంలో తాండవిస్తున్న నిరుద్యోగ సమస్యను పరిష్కరించు టెట్లు? నివారించుటకు, సలహా లిస్తారని భావించవచ్చా?

—పారిశ్రామికాభివృద్ధి, విద్యాభివృద్ధి చెట్టాపట్టాలు వేసుకుని సాగాలి పరిశ్రమలు లేకుండా విద్య అభివృద్ధి అయినా, పరిశ్రమలకు అనువైన విద్యావిధానం లేకపోయినా ప్రయోజనం ఉండదు.

* * *

ఇద్దరు పెద్ద మనుష్యులు సాయంకాలం 6 గంటలకు ఒక కూడలిలో కలిశారు. ఇద్దరూ చెవిటివారే. వారి సంభాషణ యిది

1. వ వ్యక్తి: ఏమండోయ్ ఎక్కడికిలా వెళ్తున్నారు.

2 వ వ్యక్తి: ఆ ఏమీ తోచకపోతే సినిమాకి పోదామని బయల్దేరా.

1 వ: అలాగా సినిమాకేమో అనుకొన్నా.

2 వ: కాదు సినిమాకే పోతున్నా. మీరూ వస్తారా.

1 వ: నేను అటుకేసి కాదు సినిమాకి పోతున్నా.

2 వ: అలాగా అయితే మరి శలవు.

1 వ: ఆ. ఆ. మరి వస్తా

శ్రీ సి హెచ్ రామానుజాచార్యులు, ఏలూరు.

* * *

శ్రీ ఎన్ లక్ష్మీనరసయ్య—గద్వాల.

26 8-53 వారపత్రికలో "జంతర్-మంతర్" అని వేసిన చిత్రమును గురించి మాకు తెలుపగలరా?

—అది పూర్వపు రాజు లెవరో ఖగోళ పరిశోధనకోసం కట్టించిన కట్టడం

★



# జెమినివారి

# అవ్వయ్యార

శ్రీమతి కె.బి.సుందరాంబాళ్ *నటించినది*



## సెప్టెంబర్ 11 తేదీ మొదలు

ఆంధ్ర దేశంలో ప్రదర్శింపబడుతుంది...





# వెల్లువ



(12-వ పేజీ తరువాయి)

కయింది దీపా లారిపోవడంతోటే ఒక్కసారిగా ఆర్తనాదాలు ఆకాశాన్ని చీల్చేసినై 'రక్షించండి బాబో' అన్న కేకలూ, కూలుగులూ, పడిపోతున్న యిళ్ళ ఫెళఫెళార్భటులూ, ఆడవాళ్ళ యేడుపులూ, పసిపాపల పెడబొబ్బలూ, ప్రవాహంలో కొట్టుకొచ్చే రాక్షసుల్లాంటి దుంగలూ, కన్ను పొడుచుకున్నా కనిపించని కాళరాత్రి - అబ్బా! తలుచుకోడానికే భయంకరంగా వుంది ఎంత అయోమయంలో వుండాలో అంత అయోమయంగావున్న పరిస్థితిలో మా పడవలో మేమంతా ప్రాణా లరచేతుల్లో పెట్టుకుని బిక్కు, బిక్కుమంటూ కూర్చున్నాం ఇంతలో మా పడవ కెక్కడో చిన్న కన్నంపడి నీళ్లుజొటజొటా లోపలికి రావటం ప్రారంభించినై వెంటనే మేమంతా పక్కనేవున్న పెంకుటిలుమీదికి చేరాం చంద్రం సీతనీ, పిల్లాణ్ణీ జాగ్రత్తగా పట్టుకూచున్నాడు నేను, మిగతావాళ్ళూ నుంచున్నాం మేమందరం యింటికప్పుమీదికి చేరిన అయిదునిమిషాల్లో పడవనిండా నీళ్ళుచేరి మునిగిపోయింది పడవవాడు పెట్టినగోలకి అంతులేదు కాని వాడు మాత్రం యేంచేస్తాడు? ఎల్లాగోలాగ ఎంతో కష్టపడి మేమంతా వాణ్ణి ఊరుకోబెట్టాం ఇంతలో మరో పడవ కనిపించింది కనుపించిందేతడవుగా అందరూ అందులో కురికేశారు అందులోవాళ్లని బ్రతిమలాడి చంద్రాన్నీ, సీతనీ, పాపనీకూడా యెల్లాగో పడ వెక్కించాం నేనెక్కబోతోంటే ఆపడవవాడింక వీల్లేదన్నాడు వీ ఒక్కరెక్కినా యింక మునిగిపోతుందన్నాడు తప్పని సరిగా నేనక్కడే వుండిపోవలసి వచ్చింది

పడవ ముందుకు సాచ్చుకుంటూ పోయింది ఆ యింటికప్పుమీద నేనొంటరిగాణ్ణయిపోయాను ఇంతలో సరిగా నాకో గజం - రెండుగజాలదూరంనించి 'బుస'లు వినిపించినై దాంతో అక్కడో తాచుపాము చేరిందని గ్రహించుకోగలిగినప్పుడు నాపై ప్రాణాలు పైనే పోయినై ఏంచేయడానికీ పాలుపోలేగు అయితే - అదికూడా దానిప్రాణాల్ని రక్షించుకునేందుకే చేరిందని కొంతవరకూ ధైర్యంగా కూర్చోగలిగాను ఎంతైనా మానవుణ్ణిగదా! గట్టిగా 'బుస'లు వినిపించినప్పుడల్లాగుండెలుమరింత వేగంగా కొట్టుకునేవి ఆ సమయంలో ఎలా ప్రాణం బిగపట్టుకుని కూర్చున్నానో నాకే అర్థంకాదు ఇంతలో అదే యింటిమీదికి నీటిలో యీదుకుంటూవచ్చిన గుఱ్ఱం ఒహ టెక్కబోయింది. కాలు జారి నీళ్లలో పడింది అలా ఒకటి రెండుసార్లు జరిగిం తర్వాత ఎల్లాగోలా నిలదొక్కుకునిపాపం! - దానిప్రాణాన్నది కాపాడుకుంది ఆయింటి కప్పుమీద, ఆరాత్రి, నీళ్లమధ్య, ఒక గుఱ్ఱమూ, ఒక మనిషీ, ఒక భయంకర సర్పమూ అతికష్టంమీదప్రాణాల్ని కాపాడుకున్నారు 'ఎవరైతే నేమిట - ఆపత్సమయంలో జీవులన్ని ఒకటే' అన్న చిన్న వేదాంత రహస్యం, అంత పెద్దకష్టంలోనూ నా చిన్న బుర్రలో తళుక్కున మెరిసింది ఎలాగైతే నేం? కన్ను పొడుచుకున్నా కనుపించని ఆ కాళరాత్రిగర్భంలో ఇటు గుఱ్ఱానికీ, అటు త్రాచుపాముకీ మధ్య, నూదులు గుచ్చేచలిలో గడగడ వణికిపోతూ కొన్ని ఘడియలు గడిపేను 'మళ్ళీ తెల్లవారుతుందా' అనుకున్నాను 'ఈ కష్టం గట్టెక్కుతుందా!' అనుకున్నాను

అనుకుంటూండగానే తెలవారింది తెల్లవారడమే తడవుగా పది పదిహేను పడవలు కనపించినై కనుపించడమే తడవుగా యెగిరిపోతున్న పంచప్రాణాలూ మళ్ళీ దేహంలో చేరుకున్నై అతికష్టంమీద నేనో పడవలో కురికాను పాపం! గుఱ్ఱం కూడా రాబోయింది కాని మనుష్యులు దాన్ని రానియ్యలేదు అవును - అది పశువు, వీళ్లు మనుష్యులు-అదే వీళ్ళ తేడా! అందుకే ఆ గుఱ్ఱం అక్కడే వుండిపోవలసి వచ్చింది పాము మాత్రం కనుపించలేదు ఎక్కడికో పోయుంటుంది ఈ పడవలన్నీ అన్నివైపులికీ వెళ్ళి, చెట్లకొమ్మల్ని వేళ్లాడే వాళ్ళనీ, యిళ్ళమారుల్ని పట్టుకుని ఊగిసలాడుతున్న వాళ్ళనీ, నాలా యిళ్ళమీదనూ, డాబాలమీదనూ వున్నవాళ్ళనీ, యెంతోమంది నెక్కించుకుని రోడ్డుమీదికి చేరినై కొంతమంది ముసిలివాళ్ళు, ఆడవాళ్ళు, చంటిపిల్లలు, యీతరానివాళ్ళూ నీళ్ళలో ప్రాణాలొదిలేశారు కట్టుబట్టలతో, ప్రాణాలు దక్కించుకుని బయటకొచ్చినవాళ్ళ సంఖ్యాకులు జమిందారు దగ్గర్నుంచీ, ముష్టివాడిదాకా - వున్నవాళ్ళన్నట్టు బయటపడ్డారు ఆ సమయంలో తారతమ్యా లెవ్వరూ గణించనే లేదు - తారతమ్యం లేని జలదేవత సముఖంలో. ఆ ప్రదేశం అంతా, ఆక్రోశాలతో, ఆర్తనాదాలతో, అరుపులతో, యేడ్పులతో నిండిపోయింది అక్కణ్ణుంచి నెమ్మదిగా యింటి కెడదామని నడక ప్రారంభించేను మిగతా ప్రదేశాలనుంచి వచ్చిచూసే జనానికంతులేదు జనం విరగబడిపోతున్నారు

నిన్న సాయంత్రం ఆ అందసౌందర్యాన్ని చూసి ఆనందించినవాళ్ళే, యీ ఉదయం అదే వఱదల్ని చూసి నైరాశ్యంతో, పెల్లమొగాల్తో పోతున్నారు.

*    *    *

మామూలుగానే జనం గుంపులు గుంపులుగా పోగుబడుతున్నారు ఎరిగున్న ఓ రిటైర్డు యింజనీరుగారు చుట్టూ మూగినవాళ్ళతో అంటున్నారు "ఛీఛీఛీ! ఎంత పాడుపని చేశారండీ వీళ్ళంతా కలిసీ అనవసరంగా యెంతమంది ప్రాణాలు తీసేసేరండీ అయినా నేను ముందరే అనుకున్నా. నిన్న గట్టంతా గాలించి చూశాను - ఒక్క యింజనీరన్నా, చివరికి సూపరువైజరన్నా కనిపిస్తాడేమో గండి నాపుచేసే మార్గం చెబుదామని అబ్బే! ఒక్కళ్ళూ ఫికరులేరు *Flood bank* మొత్తంమీద ఒక్క బాధ్యతగల ఉద్యోగస్థుణ్ణి చూద్దామంటే కనుపించలేదు అయింది - అంతా కలిసి మనల్ని నట్టేట్లో ముంచేరు." ఆగుంపులోంచే యెవడో ముందుకొచ్చి అన్నాడు "పాపం వాళ్ళుకూడా గండిపూడ్చడానికి ప్రయత్నించారుటండీ లాభం లేకపోయిందిట" దీంతో యింజనీరుగారికి కోపంవచ్చి ఛెడామడా దులిపేశాడు "ఏం ప్రయత్నించారయ్యా వీళ్ళు గట్టు ప్రక్కన 'జల' పుట్టి అక్కడ నీరు బొటబొటా పైకి విరజిమ్ముతోంటే దానిమీద యెన్ని యిసక బస్తాలేస్తేమాత్రం ఆగుతుందా, జెమాజెట్టీల్లాంట వాళ్ళని నలుగుర్ని తాళ్ళుకట్టి 'పైన' ఊట ఊరుతున్న స్థలానికి తిన్నగా నదిలో పదేపది యిసకబస్తా లేస్తే రక్కున కట్టపారేసును వీళ్లకేవన్నా తెలిస్తేగా అని ఆయన కఱ్ఱ నేలకేసి కొట్టుకుంటూ నీళ్ళవైపు వెళ్ళిపోయాడు

*    *    *

ఊరుని ముంచిన నీరలా రెండురోజులు నిలవుండిపోయింది బళ్ళు, కార్లు పరుగెత్తిన రోడ్లమీద పడవలు, లాంచీలు ప్రయాణం చేసినై నిన్నటిదాకా నలుగురికీ పెట్టిన దాతలు, యివాళ నలుగురి 'పెట్టు'కీ ఆశించవలసి వచ్చింది ఈ పట్టణాని కగతి పడుతుందని, కనీసం కలలోనైనా యెవ్వరూ అనుకోలేదు  *  *  *

నదీమతల్లి కా పట్టణవాసులమీద యిప్పటికైనా అనుగ్రహం కలిగిందా అన్నట్లు - నెమ్మది నెమ్మదిగా నీరు తీయడం మొదలుపెటంది కొద్దిగంటల్లో, అతివేగంతో వచ్చిన దారినే నీరు నదిలో కలిసిపోయింది ఎంత వేగంతో పట్టణంలోకి ప్రవేశించిందో, అంత వేగంతోటే నీరు తీసిపోయింది నీరు పూర్తిగా తగ్గడంతోటే పడిపోయిన యిళ్ళు,శవాలు బయటపడినై ఆదృశ్యాల్ని చూసి భరించటమన్నది మానవమాత్రుడికి చేతగానిపని కాని కొద్దిరోజుల కా దృశ్యాలన్నీ స్మృతిమాత్రంగా మిగిలినై



## ★ మొదటి జీతం ★

(8-వ పేజీ తరువాయి)

కులింటుందని అమ్మలక్కలు అనుకోవాలని అది చేస్తుంది. వాణ్ణి ఆ తల్లి యెక్కడ నిలు కనిస్తుందని పదిమందీ అనుకోవాలని వాడు శేస్తున్నాడు బయటివాళ్ళకేం తెలుస్తుంది యిదంతాను గట్టిగా అరుస్తూ వుంటే నిజంగా రత్తమ్మ అలాంటిదే గామోసు ననుకుంటారు పదిమందీను; ఈ కీలకం చేసుకున్న మొగుడికీ, చదువుకుంటూన్న కొడుక్కీ అర్థం కాకుండా వుంటేను "

అతనికి దగ్గరగా యెవరో వెక్కి వెక్కి యేడుస్తున్నట్లనిపించి, లేచి చూడాలనుకున్నాడు. కాని లేవలేదు ఎక్కడినుంచో వినవస్తూన్నట్లు "*You have not done a good thing brother*" "ఇంత కర్చు చేసియేం లాభంరా " మాటిమాటికీ వినవస్తున్నాయి.

సగం నిద్రలో, సగం జాగ్రదవస్థలో వున్న రంగారావు యీ విషయాలను గురించి, యెంతగానో ఆలోచించాలని ప్రయత్నించాడు అయినా వీలుపడదు ప్రయత్నించలేడు "తమ్ముడూ తండ్రి కూడా నన్ను అపార్థం " అంతకుమించి అనుకోడం, వూహించడం అతనికి సాధ్యపడలేదు "అమ్మకూడా యిలా అనుమానించడం "

ఏదో భయం, గుబులు, విచారం, కోపం, బాధ అంతా కలసి అతన్ని కిందుమీదులు చేస్తున్నయి గొంతు పిసుక్కొని చావాలనుకున్నాడు ఆస్థితిలో అతనికి అంతా ఓ కలలా వుంది ఎప్పుడు, యేవేళ నిద్ర పీడపట్టిందో కాని లేచేటప్పటికి యెనిమిదిన్నర అయింది తొమ్మిదింటికి బయటికి వచ్చాడు వెళ్లిపోతూవుంటే తల్లి అన్న మాటలు వినిపించాయి

"చదివించాం, పెద్దవాణ్ణి చేశాం, అయినా నీవు మా కక్కరకు వస్తావన్న ఆశ లేదు ఏదో నీవూ, నీపెళ్లాం-నీబిడ్డ యిక వేరే పొయ్యి పెట్టుకోండి "

ఈ మాటలు విని ఆగిపోవాలని అడుగుల తొందర తగ్గించాడు

"అవును చంపండి మీ యిష్టం వచ్చినంతగా పీడించండి ఇంట్లో నరకం పచ్చి నరకం అవును నీవన్నట్టు వేరే కాపురం వుంటేనే మంచిది ఇంతకన్నా మేలు కాని - కాని పదిమందీ నా నోట్లో వూస్తారు నానా మాటలూ అంటారు 'ఇన్నాళ్లూ తలిదండ్రులు కష్టపడి చదివిస్తే యీనాడు పెద్దాడై ప్రయోజకుడై, వాళ్ళని వదిలి, బుద్ధిమంతుడు వేరే కాపురం పెట్టాడు చూడు' - అంటూ నా ముఖాన వూస్తారు. అంతకంటే చస్తే మేలు. అవును చస్తాను" అని అరవాలనుకున్నాడు. కాని అప్పటికే వీధిలోకి వచ్చేశాడు

ఆ సాయంత్రం రంగారావు యింటికి రాలేదు ఒకటి, రెండు, మూడు, నాలుగు రోజులయినా యింటికి రాలేదు తమ్ముడు ఆఫీసుకు వెళ్ళితే అతని అయిపే లేదన్నారు. ఇంటిమేట్ చేయకుండా పర్మనెంటుగా ఆబ్సెంటు అవుతున్నందుకు సస్పెండు చేశామన్నారు

వారంరోజుల తరువాత అతని ఫోటో పత్రికలో పడింది

"కనబడటం లేదు" అని యీ విధంగా వుంది

నీ దిగులుతో తల్లి మంచం యెక్కింది నీభార్య కృశించిపోతూ వుంది తమ్ముడు చదువు మానుకొని తిరుగుతూ వున్నాడు బిడ్డకు జ్వరం తండ్రి రాత్రింబగళ్లు దిగులుతో, ఆశతో నీకోసం తిరుగుతున్నాడు అందరూ నీకోసం యెదురు చూస్తున్నారు ఎక్కడున్నా తప్పక తిరిగి రావాలి నీ మనస్సు కెలాంటి కలతలూ కలగకుండా చూచుకున్నే బాధ్యత మా అందరిపైనా వుంది

ఇట్లు
నీవారందరు

## ★ ముచ్చటగా ముగ్గురు

(35-వ పేజీ తరువాయి)

కుక్కని నేను ఎక్కడా చూడలేదు. నీటిమీద వెల్లకితలా పడుకొని, నాలుగుకాళ్లూ గాలిలోకి విసిరేసి కొట్టుకొస్తున్నది ప్రవాహంతోపాటు కొట్టుకువచ్చిన శ్లే వచ్చి, మా పడవదగ్గరదాకా వచ్చాక, అక్కడ ఏదో చిన్న దుబ్బు అడ్డంవస్తే, దానికి తగులుకొని అక్కడే ఆగిపోయింది

జార్జి తనకి టీ అక్కరలేదని, కప్పులో వున్నదంతా నదిలో ఒలకబోశాడు హారిస్సు, తనకీ దాహంగా లేదని అంటూ, జార్జిగాడు చూపెట్టిన మార్గాన్నే అనుసరించాడు. అప్పటికే నేను కప్పులో సగానికి పైగా టీ తాగేసినందువల్ల ఏం చెయ్యటానికి తోచక, నేనూ తాగకుండా వుంటే ఎంత బాగుండునా అని ఆలోచిస్తున్నాను.

అయినా ఎందుకైనా మంచిదని "అయితే నాకు నిజంగా టైఫాయిడ్ వచ్చేస్తుందంటావా?" అని జార్జిని అడిగాడు. "ఎబ్బే, రాదు లె"మ్మంటూనే జార్జి, "అయినా మరొకపక్షం రోజులపాటు వేచిచూస్తేనేకాని, నీకు టైఫాయిడ్ వచ్చేదీ లేనిదీ గట్టిగా చెప్పలే"మన్నాడు, జార్జి.

(ఇంకా వుంది)

#  కాసుకి దాసులు 

(19-వ పేజీ తరువాయి)

చూస్తాను లెండి! ఇది అనుమానం కేసు కాబట్టి, మీరు యితరత్రా కూడా విచారించండి ఉత్సవంలో ఎవరు వస్తున్నదీ, ఎవరు పోతున్నదీ, నెవరేమి చేస్తున్నదీ కనిపెట్టే వారెవరు? మీ రెప్పుడు హాజరు కమ్మంటే అప్పుడే వస్తుంది అప్పి నేను పూచీ పడుతున్నాను" అన్నారు 'సరే' అంటూ డాక్టరు గారియందలి గౌరవ విశ్వాసాలతో యినస్పెక్టరుగారు అప్పిని అప్పటికి విడిచిపెట్టారు

డాక్టరుగారు అప్పిని తమ యింటికి తీసుకుపోయి - అడగవలసిన విధంగా అడిగారు; చెప్పవలసినవిధంగా చెప్పారు, బెదిరించారు అన్నింటికీ "మీ పాదాల సాక్షి బాబూ, నేనేమీ నెరగను" అని జవాబు చెప్పింది అప్పి ఒక నిమిషం ఆలోచించి డాక్టరుగారు "నీ అరవై రూపాయలూ యిచ్చేశాడా వెంకయ్య" అని అడిగారు యింకా యివ్వలేదంది "సరే, యింటికి పో తరువాత సంగతి చూద్దాం" అన్నారాయన

మర్నాడు ఉదయం డాక్టరుగారు పేషెంట్లని చూడడానికని బయలుదేరారు కొందరు రోగులను చూచిన తరువాత దారిలోనే వున్న పోలీసుస్టేషనుకు వెళ్ళారు ఇన్స్పెక్టరుగారు వీరిని సగౌరవంగా ఆహ్వానించారు కొన్ని నిమిషాలు మాటామంతీ అయిన అనంతరం యిన్స్పెక్టరుగారు డాక్టరుగారితో అప్పి విషయం ప్రస్తావించి - తాము అప్పుడే అనుమానస్తులను వాకబు చేయిస్తున్నామనీ, యింతవరకూ యేమీ తేలలేదనీ చెప్పారు డాక్టరుగారు ఆయనతో వెంకయ్యగారికీ అప్పికీ అంతకు మునుపు జరుగుతూవస్తున్న కథ వివరించి, ఒక ఉపాయం చేస్తే బాగుండు నన్నారు అదేమిటని అడిగారాయన డాక్టరుగారు యిన్స్పెక్టరుగారి చెవిలో ఏదో ఊది, ఇలా చేస్తే వెంకయ్య కంప్లైంటులోని యథార్థం యేమాత్రమో తెలుస్తుం దన్నారు ఇనస్పెక్టరుగారి ముఖం వికసించింది వెంటనే జవానులు ఆయా వ్యక్తులకోసం పంపబడ్డారు

ఒక పావు గంటలో పిల్లాడితో సహా వెంకయ్య, గ్రామమునసబుగారు, అప్పి స్టేషనుకు హాజయారు ఉచితరీతిని అందరినీ మర్యాద చేశారు యినస్పెక్టరుగారు కొంత సేపు అంతా క్షిపితంగా కూర్చున్నాక

"కుర్రాడు ఎంత ముద్దొస్తున్నాడండీ వెంకయ్యగారూ! నీ చేతు లెల్లా వచ్చాయే యీ పసివాడి మెళ్లో గొలుసు లాగయ్యడానికి?" అంటూ యినస్పెక్టరుగారు "నీ పేరేమిటి బాబూ!" అని నవ్వుతూ ఎంతో లాలనగా కుర్రవాణ్ణిఅడిగారు ఆ అబ్బాయికి ఆకళ్లు వుంటాయి "చివయ్య' అని ముద్దుగా జవా బిచ్చాడు. అంతా మెచ్చుదలగా "ఓహ్హో"అంటూ ఒక్కమారు నవ్వారు ఆ కుర్రాడూ నవ్వాడు

"చాలా మంచి అబ్బాయండీ వెంకయ్యగారూ మీవాడు" అని యినస్పెక్టరుగారు ఆ కుర్రాణ్ణి చూచి "యిలా దా బాబూ!" అని తమ ఒళ్లోకి పిల్చారు "చాలా మంచివాడేనండీ అబ్బాయి!" అంటూ డాక్టరుగారూ, మునసబుగారు కూడా వంతపాడారు. వెంకయ్య ఉబ్బితబ్బిబ్బై "యేం మంచండీ అగతా తమ దయ" అంటూ "యినస్పెక్టరు బాబుగారు పిలుస్తున్నారు వెళ్లు బాబూ!" అని కుర్రాడితో అన్నాడు ఆ అబ్బాయి భయం తీరి యినస్పెక్టరుగారివద్దకు వెళ్ళాడు ఆయన కుర్రాణ్ణి ముద్దాడుతూ 'బిస్కట్లు కావాలా బాబూ' అంటూ అంతకు మునుపే డాక్టరుగారు తనచేతి కిచ్చిన బిస్కట్లలో రెండు తీసి యిచ్చారు 'యినస్పెక్టరుగారికి పిల్లలంటే ఎంత ప్రేమ!' అనుకున్నారు వెంకయ్య, మునసబుగారు, అక్కడ శివయ్య బిస్కట్లు తింటున్నాడు

తిరువాత యినస్పెక్టరుగారు అప్పివేపు తిరిగి "ఏం, అప్పీ! యిప్పుడైనా చెప్పు! తీశావా, లేదా?" అని అడిగారు

"లేదు బాబూ!"

"నిష్కారణంగా చెడిపోతవు సుమా నిజం చెప్పావంటే క్షమించడానికి వీలుంటుంది వెంకయ్యగారైనా అంత కఠినాత్ములు కారు"

"వస్తువు తీసుకొస్తే, నా కంతకంటె కావలసిం దేముందండీ! గొలుసు పోయింది మొదలు వీళ్లమ్మ మంచినీళ్లయినా ముట్టలేదండీ" అన్నాడు వెంకయ్య.

"నా పిల్లలతోడు నే నెరగను బాబూ" అంది అప్పి.

"ఈ దొంగ వేషా లింక కట్టిపెట్టవే నువ్వే తీశావని కుర్రాడే చెబుతూ వుంటే" అంటూ అప్పిమీద కళ్లెర్ర జేశాడు వెంకయ్య ఈ కొత్త విశేషానికి అంతా ఆశ్చర్యపోయారు అందరికీ అప్పి



మీద అనుమానం ధృవపడింది

అప్పి నిలువునా వణికిపోతోంది "అబ్బాయిగారే చెప్పారా? నేనుతీసినట్టా?" అబ్బాయిగారూ! నిజం చెప్పండి, నేను తీశానా" అంటూ దీనంగాఅడిగింది అందరి దృష్టులూ ఒక్కమారు కుర్రాడి ముఖంకేసి సారింపబడ్డాయి యింకా బిస్కట్లు తింటూనే వున్నాడు అప్పి కోక్షణకాలం వేపు ఒకమారు చూచి శివయ్య అమాయకంగా "జౌను, నువ్వే తీశావు నాన్న" అన్నాడు

"... ..!" అంటూ అక్కరంతా ఒక్కమారే దిగ్భ్రాంతి అప్పి మొహం కలకలలాడింది తల వంచుకున్నాడు

"వగైరా అరవై రూపాయలకోసం అంతకానికి ఒడిగట్టావయ్యా!" అని డాక్టరుగారు గర్జిస్తూ, అప్పి చేత మానష్టం దావా వేయిస్తా నన్నాడు ఇక లాభం లేదని వెంకయ్య లేచి అందరినీ క్షమించమని కాళ్ళ బేరానికి దిగాడు

తర్జన భర్జనలు కొంతసేపు జరిగిన తరువాత డాక్టరుగారికి మునసబుగారు యీ తీర్పు చెప్పారు: "పరువు నష్టం క్రింద యేభై రూపాయలు అప్పికి వెంకయ్య ఇచ్చుకోవాలి. ఇవ్వవలసిన పూర్తి జీతం కూడా చెల్లించబడాలి"



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St, Madras